"అపర శంకరులు" – "అభినవ విద్యారణ్యులు"

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు

(1వ భాగము – జీవిత చరిత్రము)




రచన :

మధుర భారతి, బాల కవి సమ్రాట్

**ఆచార్య శ్రీ కంచర్ల పాండు రంగ శర్మ** ([illegible])

(శ్రీ భద్రాచల రామదాసు కంచర్ల గోపన్నగారికి 9వ తరం వంశపారంపర్య వారసుడు)

1. పీఠాచార్యులు : శ్రీ రామదాసు విద్వత్పీఠం -నేలకొండపల్లి, ఖమ్మం జిల్లా.
2. శ్రీ భద్రాచల రామదాసు ప్రాజెక్టు సలహా సంఘ సభ్యులు
3. కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సాహిత్య పురస్కార గ్రహీత
4. మహాకవి శ్రీ గుఱ్ఱం జాషువా విశిష్ట పురస్కార గ్రహీత.
5. సినారె ధర్మ చారిటబుల్ ట్రస్టు వారి రాష్ట్ర ప్రతిభా పురస్కార గ్రహీత (2010).

( గౌరవాచార్య, [illegible] )

Cell No's : - (+91)9700311109

**BELLAMKONDA DIGITAL LIBRARY.**

SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA LIFE HISTORY.(TELUGU)

FIRST DIGITAL EDITION : - 02-12-2010.

FIRST PRINTED EDITION : - 15-11-2010.



AUTHOR :- **SRI KANCHERLA PANDU RANGA SARMA.**

PRINTED AND PUBLISHED BY :

SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA DIGITAL LIBRARY.

SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA TRUST.

SRI NILAYAM, Do.No. 12-8-5/5,

NEAR :- SUB POS OFFICE,

PRAKASH NAGAR,

NARASARAO PET(PO) PIN : -522 601.

GUNTUR (Dt) , ANDHRA PRADESH. INDIA.

Ph.No's : - **(+91) 9700311109 & 98664001 33**

DIGITALIESED BY :-

NAVYA.

GRAPHICS AND DESIGN'S.

Ph.No.'s :- **(+91) 9908565337 & 7893604909.**

# శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రులు

మధుర భారతి





ప్రథమ ముద్రణ : వేయి ప్రతులు
వికృతినామ సంవత్సరము 2010

మూల్యము :

ప్రచురణ : శ్రీ బెల్లంకొండ రామా రాయకవీంద్రుల ట్రస్టు
తరపున బ్ర॥శ్రీ బెల్లంకొండ వేంకటసుబ్రహ్మణ్య శర్మ & సన్
ఇంటి నెం. 12-8-5/5, ప్రకాష్‌నగర్, నరసరావుపేట.

ప్రతులకు : గ్రంథకర్త సన్నిధి
శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల ట్రస్టు,
ప్రకాష్ నగర్, నరసరావుపేట.
Cell No's - (+91)9700311109
**9866400133**

D T P & PRINTED By
NAVYA GRAPHICS and DESIGNS.
NARASARAOPET-522601.
CELL : - (+91) 9908565337 and 7893604909.

# ఎందరో మహానుభావులు

నా కూర్చిన అపర శంకరులు - అభినవ విద్యారణ్యులునైన బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ రామా రాయ కవీంద్రులవారి జీవిత చరిత్ర రచనకు తమ రచనలతో సహకరించిన మహా పండిత కవులు.

1. బ్ర॥శ్రీ॥ లంకా సుందరరామశాస్త్రి గారు - అంబాపురం
   (కవీంద్రుల వారి ముఖ్య శిష్యులు)
   ( శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్ర జీవిత చరిత్రము)

2. బ్ర॥శ్రీ॥ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు- నరసరావుపేట
   ( శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల గ్రంథములను కష్ట నష్టముల కోర్చి ముద్రించి వెలుగునకు తెచ్చిన మహనీయులు)

3. బ్ర॥శ్రీ॥ బోడపాటి సీతా రామాంజనేయ శర్మగారు (స్వధర్మప్రకాశిని)
   - హైదరాబాద్.

4. బ్ర॥శ్రీ॥ కనపర్తి మార్కండేయ శర్మ గారు.

5. బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ రామా రాయ కవీంద్రుల పౌత్రులు. సన్నాదరంతోను పెద్ద మనస్సుతోను, ఆత్మీయ బాంధవునిగా మన్నించి కవీంద్రులు వ్రాసిన శ్రీ భగవద్గీతా భాష్యార్కప్రకాశిక, శ్రీ సిద్ధాన్త కౌముది శరదాత్రి (వ్యాఖ్యాన) మున్నగు గ్రంథాలను అడిగనదే తడవుగా వానికి నకళ్ళు తీయించి, దయ చేయించిన బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ వేంకట సుబ్రహ్మణ్య శర్మ గారున్నూ వారి కుమారులు చి॥ శ్రీ॥ వేంకట లక్ష్మీ నరసింహ చక్రధర కుమార్ గారున్నూ ఇంకను అనేక రకముల సహకరించిన

**అందఱకు వందనాలు**

మీ

**మధుర భారతి**

వినుకొండ.



మహాపండితులు, కవీంద్రుల వారి గ్రంథచయముద్రాపకులు

కీ.శే. బ్ర॥శ్రీ॥ **కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి** గారు

నరసరావుపేట.

ద్రవ్య దాత        రచయిత



శ్రీ బెల్లంకొండ వేంకటసుబ్రహ్మణ్యశర్మ , నరసరావుపేట

మధుర భారతి కంచర్ల పాండు రంగ శర్మ, వినుకొండ.




శ్రీ బెల్లంకొండ వేంకటసుబ్రహ్మణ్యశర్మ , శ్రీమతి అరుణ దంపతులు
నరసరావుపేట.



Pernamitta Padmavathi
Nageswara Rao - Lakshmi Srivalli

శ్రీ పెర్నమిట్ట పద్మావతి గారి కుటుంబము వారి అనుభవాలు (అనుబంధం - 5లో)



**శ్రీ కంచర్ల పాండు రంగ శర్మ – సత్యవతీ దేవి గారలు**

మధుర భారతి (శతాధిక గ్రంథకర్త)
(భద్రాచల రామదాసు శ్రీకంచర్ల గోపన్నగారికి 9వ తరం
వంశపారంపర్య వారసుడు)
2010 ప్రతిభా పురస్కార గ్రహీతలు(స.ధ.చా.ట్రస్ట్)



| ద్రవ్యదాత | మహామహోపాధ్యాయ | మధుర భారతి |
|---|---|---|
| శ్రీ బెల్లంకొండ వేంకటసుబ్రహ్మణ్యశర్మ , | డా॥ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు, | శ్రీ కంచర్ల పాండు రంగ శర్మ, |
| నరసరావుపేట. | హైదరాబాద్. | వినుకొండ. |





ఓమ్ స్వస్తి శ్రీ గణేశాయ నమః

" శ్రీ శంకర భగవత్పాదాః విజయన్తే !"

"శతాధిక గ్రంథనిర్మాత, వేదాంత విశారద, వేదాంత సాగర, శాస్త్ర కళానిధి"

**మహామహోపాధ్యాయ డా॥ పుల్లెల శ్రీరామ చంద్రుడు** గారు,

(వేదాంత శిరోమణి(సంస్కృతం), విద్వాన్ (తెలుగు), యం.ఏ., పిహెచ్.డి. (సంస్కృతం).

యం.ఏ., (ఇంగ్లీష్), యం.ఏ. (హిందీ), విశ్రాంత ప్రొఫెసర్ (సాంస్క్రిట్), ఉస్మానియా విశ్వవిద్యాలయం)

# ప్రమోదము

"జ్వలతి చలితేన్ధనో గ్నిర్విప్రకృతిః పన్నగః ఫణాం కురుతే,
ప్రాయః స్వం మహిమానం క్షోభాత్ప్రతిపద్యతే జన్తుః" (అభి.శా. 6.31)

"అణిగి ఉన్న అగ్ని, కట్టెలు కదపగానే ప్రజ్వలిస్తుంది. ఏ చిన్న అపకారం జరిగినా సర్పం పడగ విప్పుతుంది. సాధారణంగా ప్రతి మనిషి కూడ, క్షోభకలిగించినప్పుడు మాత్రమే తన గొప్పతనం, అసలు స్వరూపం, చూపుతాడు". అని అంటాడు కాళిదాసు! అభిజ్ఞాన శాకుంతలంలో. ఇది శ్రీ బెల్లంకొండ రామా రాయ కవి గారి విషయంలో అక్షరాలా సత్యం అనిపించుకున్నది.

అర్థ రహితాలైన అద్వైతి సిద్ధాంత విరుద్ధ వాదాలన్నీ ఉపేక్షించు, నిరంతరాత్మనుసంధానం చేసికొంటూ ప్రశాంతంగా సార్థక జీవనాన్ని గడుపుతున్న శ్రీరామా రాయ కవి గారి విషయంలో, ఒక ఆచార్యుల వారి అహంకార పూరితమైన ప్రవర్తన, ఆయన తీవ్రంగా విజృభింప చేసేటట్లు చేసింది. దానితో వారి లేఖిని నుండి వేదాంత శాస్త్రానికి సంబంధించిన అత్యద్భుతములైన వాఙ్మయం ఆవిర్భవించింది. ఇలాంటి మహాపురుషుల చరిత్ర రాబోవు తరాల వారికి ఉత్సాహ జనకంగా, స్ఫూర్తి ప్రదంగా ఉండి, వారి అసాధారణ వైయక్తిక జీవన విధానం నుండి అద్భుత గ్రంథ జాలం నుండి, అత్యధికమైన ప్రయోజనం పొందే అవకాశాన్ని కలిగిస్తుంది.

మధుర భారతి, (బాల) కవిసమ్రాట్ మొదలైన బిరుదాలతో అలంకృతులు, శతాధిక గ్రంథ రచయితలు అయిన ఆచార్య శ్రీ కంచర్ల పాండు రంగ శర్మ గారు, " శ్రీ బెల్లం కొండ రామా రాయ కవీంద్రులు" అను "జీవన చరిత్రము 1వ భాగము", ద్వారా ఆస్తికులకు అలాంటి సదవకాశాన్ని కల్పించడం ప్రమోదజనకం.

సమకాలికులైన మహాపండితుల నుండి "అపరశంకర" అను అసాధారమైన బిరుదమును, సాక్షాత్తు శ్రీ శృంగేరి పీఠాధిపతుల నుండి 'అభినవ విద్యారణ్య' అను బిరుదమును పొందిన శ్రీ రామారాయ కవి గారి శాస్త్ర పాండిత్య విషయములో

ఎవ్వరికీ అభిప్రాయ భేదం ఉండడానికి అవకాశం లేదు. అట్టి మహా పురుషుని జీవిత చరిత్రమును తెలిసికొనవలెనను కుతూహలం అందరికీ ఉండడం సహజమే! దానిని పూర్తిగా తీర్చినది ఈ "జీవిత చరిత్రము".

రచయిత ప్రత్యక్షంగా శ్రీరామా రాయ కవీంద్రుల కుటుంబ సభ్యుల నుండి, శిష్యుల నుండి, వారికి సన్నిహితులైన ఇతరులనుండి అనేక విషయాలను సేకరించి వ్రాసిన ఈ చరిత్ర యథార్థ్యాన్ని ఎవ్వరూ శంకించడానికి అవకాశం లేదు. ఉదాహరణకి :- శ్రీరామా రాయ కవిగారిలో పరివృత్తి రావడానికి కారణమేమిటి? వారు వేదాంత శాస్త్రంలో ఎలాంటి ఉద్గ్రంథాలు రచించారు? ఎన్ని కావ్యాలు వెలయించారు? ఇత్యాది విషయాలు చాల మంది సంస్కృతాభిమానులకు తెలిసినా! వీరి పూర్వ పురుషులు మగధ దేశమునుండి ఆంధ్ర దేశానికి ఆశోకుని కాలంలో వలస వచ్చారనీ, అందుచేత వీరికి మాగధులు అను పేరు వుండేదనీ, వీరికి శస్త్ర - శాస్త్రాలలో అసమానమైన అద్భుతమైన ప్రావీణ్యం ఉండేదనీ, చాల మందికి తెలియడానికి అవకాశం లేదు.

బెల్లంకొండ వారికి సకల రాజ లాంచనాలతో కూడిన జమీందారి ఉండేదను విషయాన్ని శ్రీ పాండు రంగ శర్మగారు, శ్రీ రామా రాయ కవి గారి కుటుంబ సభ్యులతో సన్నిహిత సంబంధం ఉండడంచేత తెలిసికొని అక్షర నిబద్ధం చేయగలిగారు.

ఈ పుస్తకం చివర ఇచ్చిన నాలుగు అనుబంధాలలోని విషయాలు కూడా చాలమందికి ఇదం ప్రథమ విజ్ఞేయములే!.

ఇలాంటి ఎన్నో అజ్ఞాత విషయాలు సేకరించి సూత్రప్రాయంగా అందించిన శ్రీ పాండురంగ శర్మ గారు, పండితులుకు శ్రీ రామారాయ కవీంద్రులపై ఉన్న గౌరవ భావాన్ని ఇనుమడింప చేసినందుకు, వారి తపః సంపదాదులను గూర్చి విశదంగా తెలిసికొనడానికి అవకాశం సాధారణ పాఠకులకు కూడ కల్పించినందుకు, వారికి శ్రీ రామారాయ కవీంద్ర గ్రథ శ్రద్ధాళువుల పక్షాన కృతజ్ఞతలు తెలుపుతూ, ఇట్టి పవిత్ర చరిత్ర గ్రంథమును ప్రకటించుచున్న "శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్ర నిధి" స్థాపక పరిపాలకులను అభినందించు చున్నాను.

హైదరాబాదు
5-7-2010



## ప్రాగుక్తిః

**గురుంభజే !**

శ్లో॥ శ్రీ మన్తమాదిలక్ష్మీశం! సర్వశాస్త్ర విశారదమ్!
శ్రీ బెల్లంకొండ కులాబ్దీన్దుం! శ్రీ రామా రాయగురుమ్భజే!

శ్రీ మంతుఁడును, "ప్రౌఢ సరస్వతియు", పండిత గజరాజ కంఠీరవుఁడును, సాహిత్య చక్రవర్తియు, కవికుల తిలకుఁడును, సాధుశీలుఁడును, మహా తపస్వియు, విద్వజ్జన పోషకుఁడును, అర్థిజన చింతామణియు, అన వరతాన్న విద్యా దాన తృప్తుండును, అప్రతిమాన భాష్య కర్తయు, వ్యాఖ్యా సముద్వేల ధిషణా సహస్ర ఫణీంద్రుఁడు, నిత్య సత్య వ్రతుండును, వినుత దుర్వాద కంటక కానన వీతిహోత్రుండును, ఇచ్చుటయే కాని పుచ్చు కొనుటకు చేయి జాపి నెఱుంగని నెఱదాతయు, అభినవ విద్యారణ్యులును, అపర శంకర భగవత్పాదులును, పుంభావ సరస్వతీ మూర్తియు నగు కీ॥శే॥ బ్ర॥ శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రులను గుఱించి గజ మశకాంతర యల్పజ్ఞుడనైన నేను వ్రాయం బూను కొనుట సాహసమే!

అయినను, అమ్మహామహుని పట్ల నాకు గల భక్తి ప్రపత్తులును, విదేశీ సాహిత్య సంస్కృతీ చరిత్రాదుల గఱచి మన మహోన్నతి నెఱుఁగని, నేటి తరం యువకులైన బిడ్డలకు మన సాహితీ సమరాంగణ సార్వభౌములను, సరస్వతీ మూర్తులయు జీవిత చరిత్రములను, వారి ప్రజ్ఞా ప్రాభవమును తెలియజేయ వలయునను కుతూహలమే నన్నీ పనికి పురికొల్పినది. ప్రజాకవి స్వర్గీయ శ్రీ పులుపుల వేంకటశివయ్య గారి "వెనుక తరముల నాటి వీర చరితల సిరులు నార్వోసి నీర్వెట్ట విరిసి సుఖములు పండురా" అనిన వాక్యములు నా భుజం తట్టి నాకు హృదయ స్పందన కలిగించి కలమునడిపినది.

ఇవన్నిటిని నూతగా గొని 1) నన్నయ్య భట్టు పుట్టు పూర్వోత్తరములు, 2) మహామహోపాధ్యాయ, అభినవ నన్నయ్య భట్టారక అహోబల పండితుల జీవిత చరిత్రము, 3) మహాయోగి శ్రీ తుంగదుర్తి బుచ్చయ్య అవధూతేంద్ర స్వామి (చేజర్ల కబ్బయ్య) గారి చరిత్రము, 4) శ్రీమహాకవి గుఱ్ఱము జాషువాగారి జీవితము కవితాప్రస్థానమును తెలుపుచు విశ్వనరుఁడను కావ్యము . 5) బహువివాదాస్పద జీవితాచిత్రణమున ఛిన్నాభిన్నమైన భద్రాచల రామదాసు శ్రీ కంచర్ల గోపన్న

గారి నిర్దుష్టమైన జీవిత చిత్రమును, 6) మహాకవి కాళిదాసు జీవిత చిత్రణమును వ్రాసియితః పూర్వము ప్రకటించితిని.

ప్రస్తుతమా కోవలోనిది అపర శంకర, అభినవ విద్యారణ్యుల గాథ. ఇదియు నేడు మరుగునపడజొచ్చినది. రాను రాను మన బిడ్డలకు అమ్మహామహు నెఱుగని దశయు కలుంగవచ్చును.

అందులకే శక్తి చాలకుండినను భక్తియే పరమావధిగా గొని అమ్మహామహుని గుఱించి వ్రాయ సమకట్టితిని. శ్రీ రామా రాయ కవీంద్రుల గాధను రెండు భాగములుగ విభజించి వ్రాసితిని. ప్రథమ భాగమున శ్రీ కవీంద్రుల వారిజీవితమును దిఙ్మాత్రముగా వారి రచనలను భాషా సేవలను తెలియజేసితిని. రెందవ భాగమున పండిత ప్రకాండుల సహాయ సహకారసంపత్తులతో, వారి వారి విద్యా వైదుష్యముల నూతగా గొని మహా కవి రచనలపై వ్యాసముల సమకూర్చ దలచితిని.

కావున పండితులు కవులు నా యందు ఆదర వాత్సల్యముల బరపుచు శ్రీరామా రాయ కవీంద్రులరచనలపై తమ వ్యాసములు పరిచయములు పరిశోధనలు ద్వార నుడుగరలు చెల్లింప వినీత మూర్ధన్యుండనై ప్రణమిల్లుచున్నాడను.

ఇతఃపూర్వము కవీంద్రుల జీవితాదుల గుఱించి వ్రాసి వెలువరించిన బ్ర॥శ్రీ లంకా సుందరరామశాస్త్రి, బ్ర॥శ్రీ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, బ్ర॥శ్రీ బోడెపూడి సీతా రామాంజనేయ శర్మ మున్నగు వారికి శిరసువంచి ప్రణామము లాచరించు చున్నాడను. వారి వారి రచనములే నాయీ గ్రంథావిర్భావమునకు మూలములు.

అలాగే కవి గారి వంశ పారంపర్య పౌత్రులు బ్ర॥శ్రీ బెల్లంకొండ వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారును, వారి కుమారులు చి॥ బ్ర॥శ్రీ వేంకట లక్ష్మీ నరసింహ చక్రధర కుమార్ గారును, నేను శ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల చరిత్రమును వ్రాయుచుంటినని తెలుపగా వారానందించి వారు ఆదరంతో వారికడ నుండిన కవీన్ద్రుల జీవిత చిత్రణమును యిచ్చుటయేకాక వారి కడ నుండిన నలభ్యగ్రంథముల నకళ్ళను దయచేసిరి. మఱియు అప్ర రూపములై నేడు అలభ్యములైన గ్రంథములు భగవత్గీత భాష్యార్క ప్రకాశిక, శరద్రాత్రి మున్నగు వానికి నకళ్ళు దీయించి

యిచ్చిరి. శ్రీ శర్మగారికి, వారి కుమారునకు తలనువంచి నమస్కరిస్తున్నాను. ఈ మహాజ్ఞాన కవితా యజ్ఞములో సహకరించిన వారందఱకు పేరు పేరున కృతజ్ఞతాభి వందనములను సమర్పించు కొనుచున్నాను. నా యీ పూనికలో భక్తి పూర్వకమైన అనురక్తియే కాని, శక్తి కాదని మఱియొక మారు వినమ్రుండ నగు చున్నాను.

అడిగినదే తడవుగా తమ పెద్ద మనస్సుతో భూమిక గా "ప్రమోదమును" అనుగ్రహించి నాకు ప్రమోదమును గూర్చిన మహామహోపాధ్యాయ, ఆచార్య డా॥శ్రీ పుల్లెల శ్రీరామచంద్రులు(డు) గారికి శిరస్సు వంచి నమస్కరించుచున్నాను.

శ్రీ రామా రాయ కవీంద్రుల మనుమరాలగు శ్రీమతి పేర్నమిట్ట పద్మావతి గారు, తమ తాతమ్మగారితో(ఆదిలక్ష్మి–కవీంద్రుల వారినతీమణి) గల అనుబంధమును అనుభూతులను మాకు పంపి కృతజ్ఞతకు పాత్రులైరి.

ఈ రచనలో లోపములు, మార్పులు, కూర్పులు, చేర్పులు, సలహాలు ననుగ్రహించిన వినీతుడనై గ్రహించి మలి ముద్రణములో సవరించు కొందునని వినయ పూర్వకముగా తెలియబరచుకొను చున్నాను. నిరంకుశః కవయః అను నానుడి ననుసరించి రసభంగము కాకుండ కొన్ని కూర్పులను చేసితిని – మన్నించుడని వేడికోలు!

జయన్తితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరః

మీ

మధుర భారతి

"అపర శంకరులు" – "అభినవ విద్యారణ్య"

# శ్రీ బెల్లంకొండ రామ రాయ కవీంద్రులు

(1వ భాగము – జీవితము)

**వంశ చరిత్ర : (పూర్వ స్థానము)**

శ్రీ బెల్లంకొండ వారి పూర్వులు మగధ దేశీయులు వారిలో నెక్కువ మంది సంగీత సాహిత్యములందును, వ్యాకరణ మీమాంసభాష్యకారకలందును జ్యోతిష ఖగోళశాస్త్రములందును, ఖడ్గ, ధనుర్విద్యాది రణవిద్యలందును, మల్లవీరులుగను, వేదవేదాంత పారంగులుగను, పండితులుగను, వ్యాయామ విద్యాప్రవీణులుగను నుండి విద్వన్మంత్రులై దండనాయకులై, చమూపతులై, శ్రోత్రియులై, సదాచార పరాయణులై, దానశూరులై, వ్యవహారదక్షులై, లౌక్యులై, రాజసన్మానితులై యొప్పిరి.

అశోక చక్రవర్తి రాజ్యవిస్తరణాభిలాషియై దక్షిణ భారతముపైదండెత్తిరాగా, చమూపతులు పండితులు రణవిద్యావిశారదులై **"ఇదం బ్రాహ్మ్యమి దంక్షాత్రమ"** నినట్లు వారి వెంటవచ్చి జయపతాక లెగురవైచి ఆంధ్రదేశము నందు గుర రాజప్రతినిధులుగా, జమీందారులుగా, అగ్రహారీకులుగా, దేశపాండ్యాలుగా నియమింపబడి స్థిర నివాసమేర్పరచుకొనిరి. వారు **మాగధులను** పేర పిలువబడుచుండిరి.

ఆ విధంగా వచ్చిన మాగధులలో ఒక తెగవారు నాటి కృష్ణా మండలాంతర్గత, నరసరావుపేట సమీపస్థమైన పమిడిపాడును జమీగా జేసికొని సమీప గ్రామములైన దొండపాడు, గుంటుగార్లపాడను రెండు అగ్రహారముల పై ఆధిపత్యము పొందిరి. ఇదియేగాక 84 గ్రామములలో యీనాముభూములను సంపాదించిరి.

రాజలాంఛనములైన కోటలు, రాజ సౌధములు, పేటలు నిర్మించి, రక్షకభటాదులేర్పాటు చేసికొని ఆ ప్రాంతములో జమిందారులుగ, దేశపాండ్యాలుగ పరిగణింపబడిరి. జమీందారులను "దొరవారని" గౌరవ వాచకములో గ్రామస్తులు

పిలచుచుండిరి. పమిడిపాడునకు,స్వయం భుజవరము, పహిందిపాదనియు, పయిడిపాదనియు, పమిడిపాదనియు నామాంతరములు గలవు.

సూచిక : ( ఈ విషయం శ్రీ రామారాయ కవీంద్రుల వారి సతీమణి శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారు తన మనుమలను, మనుమరాళ్ళను కూర్చుండబెట్టుకొని చెప్పగా వారిలో బ్ర॥శ్రీ వేంకట సుబ్రహ్మణ్య శర్మ గారును శ్రోతలైయుండిరి. వారు నాకీ విషయము తెల్పిరి.)

**బెల్లంకొండ వారు :**

కథాకాలము నాటికి పమిడిపాడు జమీందారీ వంశస్థులు మాగధులుగానే పరిగణింపబడుచుండిరి.

**మాగధులలో** పహిందిపాడు జేరినవారిలో మూల పురుషుడు **చెన్నప్పగారు.** ఆయన **సనద్దారుఁడుగ** నుండెను. ఆయన కుమారుడు భాస్కర దీక్షితులు, సకల శాస్త్ర విశారదుఁడు, ఖడ్గ, ధనుర్గద మల్ల విద్యానిపుణుఁడు, సంగీతార్ణవశశాంకుడు.

దేశపాండ్యలైన **భాస్కరదీక్షితుల** ప్రజ్ఞాధారం ధైర్యమునకు ప్రతిగ గుంటగార్లపాడు నగ్రహారముగ నందెను. సుమారు వేయి ఎకరముల గల భూస్వామి. ఆ గ్రామమున నింబనారింజ చూతాది వనములును, మెట్ట భూములు కలిగియుండెను. రైతులు దీక్షితులు వారి పొలములను నామ మాత్రపు కౌలుకు దీసికొని వారినంటిపెట్టుకొని జీవించుచుండిరి.

భాస్కర దీక్షితులకు పెద్ద వల్లప్ప, **పాపయ్య, రామకృష్ణయ్య** (రామకృష్ణమ్మ దేశ్‌పాండ్యా) అను ముప్పురు తనయులు వారును సకల విద్యా పారంగతులు పెద్ద వల్లప్ప పాపయ్యలు మల్ల ధనుర్విద్యాదులలో సాటిలేనివారు.

**భాస్కరదీక్షితులు** తండ్రి అమరావతీ ప్రభువులు శ్రీవాసిరెడ్డి **జగ్గయ్య నాయుడుతో** రాకపోకలు జరుపుచు మైత్రినెరపువాడు. అది పదునారవ శతకము.

జగ్గయ్య ప్రభువనంతర మాతని కుమారుడు **వేంకటాద్రినాయుడు** శ్రీ॥శ॥

1807 సంవత్సరమున అమరావతి ప్రభువయ్యెను. ఆయన తల్లిదండ్రుల పేరున అచ్చమ్మ పేట, జగ్గయ్యపేట యను పురముల నిర్మింప జేసెను.

**వేంకటాద్రినాయుడు**అరి వీర భయంకరుడై కృష్ణ వేణీనదీతీరమున తూర్పున చందోలు వరకును దక్షిణమున వినుకొండ సీమ, పడమర పలనాడువరకును రాజ్యమును విస్తరించి **'కమ్మనాడు'** నేర్పాటుగావించెను. నరసరావుపేట జమీందారును సామంతునిగా మన్నించెను.

ఆతడు సంగీత సాహిత్యాది బహు భాషాశాస్త్రములందును యుద్ధ నైపుణ్యమునందును ప్రజ్ఞ కలిగెను. ఆయనకు **మన్నెసులతాన్ బహద్దరు** అను బిరుదము గలదు. అమరావతి రాజధానిగా జేసికొని పాలించెను. అమరావతి, పొన్నూరు, చేబ్రోలు మున్నగు తావులందుగల జీర్ణ దేవాలయోద్ధరణమును గావించెను. సంస్కృతాంధ్రవిద్యావ్యాప్తికి రాజ్యములో భాషాకళాశాలలేర్పాటు గావించెను. భోజునివలె తన యాస్థానమున **నవరత్న కవులను** నేర్పాటు గావించెను. మల్లవిద్యావిశారదులను రణరంగ పారంగతులనెంపిక చేసి ఆస్థానమున సముచిత పదవులనిడి గౌరవించెను.

అవరుసలో **భాస్కర దీక్షితులను,** ఆస్థాన విద్వాంసులుగ నియమించిరి. ఆ దినములలో పలనాడు, నరసరావుపేట తాలూకాలోని గుత్తికొండ, చేజెర్ల ప్రాంతములు దట్టమైన అడవులుగలిగి యుండెను. గిరిజనులైన చెంచులు, బోయెలు, సుగాలీలు మున్నగు ఆటవిక జాతులు ముఠాలు గట్టి దారిదోపిళ్ళు, జేసెడివారు. ప్రయాణికులను నిర్ధాక్షిణ్యముగా దోచుకొనుటయే కాక, వారిని చిత్రహింసల పాలు చేయువారు.

**వేంకటాద్రి** ప్రభువును నరసరావుపేట జమీందారులైన **మల్రాజు** వారు అడవి దొంగల నడచుటకు తమ యాస్థానము నుండి దళపతులను, చమూపతులను పంపిరి.

10వ శతాబ్దానికి పూర్వము తూర్పు చాళుక్య ప్రభువుల క్రిందయీ ప్రాంతము సామంతము చేసెడిది. అప్పుడు ఆది కవి **నన్నయ్య భట్టారకుల** తండ్రి

**బేతన భట్టును** రాజప్రతినిధిగా పంపిరి. **బేతన భట్టు** వినుకొండ తాలూకా ముప్పాళ్ళను రాజధానిగ చేసికొని సైన్యసమేతుండై వెడలి ఆటవిక జాతులు నడచి రాజ్యము వెడలనడచి శాంతినేర్పాటు గావించెను.

మరలా యిన్నాళ్ళకు వారు వచ్చి అలజడులు లేపిరి. అమరావతి ప్రభువుల తరపున **భాస్కర దీక్షితుల** వారును, ఆయన కుమార త్రయమును వారినెదిరించిరి. ఘోర రణము జరిగినది. కొండ బండలు, మహా వృక్షముల మాటున పొంచి యుండిన బోయెలు, రాళ్ళురువ్విరి చెంచులు విషపూరిత బాణముల వైచిరి. ఆ శరా ఘాతములకు భాస్కర దీక్షితుల వారి కుమారు లిరువురు మరణించిరి. చిన్న కుమారుడు రామకృష్ణమ్మను దీసికొని దీక్షితుల వారు అజ్ఞాతమునకు వెడలిరి.

ఆటవికులు వికటాట్టహాసం చేయుచు తమ జోలికి వచ్చిన వారందఱినిట్లే చంపుదుమని హెచ్చరించిరి.

**భాస్కర దీక్షితులు** తన కుటుంబము వారితోను తక్కిన మాగధులతోను దాసదాసి పరిజనులతోను ఊరు విడిచిరి. అమరావతి ప్రభువు సమీప బంధువైన బెల్లంకొండ జమీందారులకడకు చేర్చి రక్షణ కల్పించిరి.

**వేంకటాద్రి నాయుడు** గారు విషయము విశద పరచుచు ఆంగ్లేయుల సహాయమర్థించిరి. ఆంగ్లసేన రంగ ప్రవేశమొనర్చి శతఘ్నులతో దారి దొంగలను కాల్చిరి. వారి ధాటికి నిలువ జాలక ఆటవికులు ఆ ప్రాంతము వదలిచనిరి.

ఆ ప్రాంతమున శాంతి నెల కొలుపుటకు నాలుగైదేండ్లు పట్టినది. మాగధులు మరలా స్వస్థానములకు చేరి తమ జమీ భూములకైవసం చేసికొనిరి.

నాటి నుండియు మాగధులను **బెల్లంకొండ** వారని పిలచుటచే అదియే వారికింటి పేరైనది. వారిలో మూల పురుషుడు **చెన్నప్పగారు**. వారానాటికి సజీవులు.

భాస్కర దీక్షితుల చిన్న కుమారుడు రామకృష్ణయ్య అనబడు రామకృష్ణమ్మ వారికి భాస్కరరావు,మోహనరాయుడు, వేంకట్రాయుండు రామయ్యలను

కుమారులు. . వేంకటరాయునకు 1). భాస్కరరావు, 2). కృష్ణయ్య, 3). రామానుజరాయుడును, రామయ్యకు 1). వేంకట్రాయుడు, 2) ఆళ్వారయ్య, 3) రామకృష్ణమ్మ, 4) నరసింగ రాయుడు, 5) రంగయ్య, 6)గోపాలరాయుడు అనఁబరగు ఆరుగురు సంతానము.

వారిలో రామయ్య గారి రెండవ కుమారుఁడైన **ఆళ్వారయ్య** గారు మహా పండితులు. వేద వేదాంగ వేత్తలు. వారు తత్త్వవేత్తలై **అద్వైత ప్రబోధకమైన "ప్రబోధ చంద్రోదయము"** నకు దీటైన **" సంకల్ప సూర్యోదయము"** మను నాటకమును రచించిరి ఆ గ్రంథము యొక్క వ్రాత ప్రతి శ్రీ రామారావు మహోదయులు జీవితకాలము వరకు వారికడ భద్రముగా నుండి, ఆ తరువాత కనుమరుగై నేడు అలభ్యమైనది.

## మహోదయము :

**"బెల్లంకొండ"** వారు ఋక్శాఖా బ్రాహ్మణులు. భారద్వాజ గోత్రులు. అశ్వలాయన సూత్రులు. నియోగి శాఖా బ్రాహ్మణులలో కరణకమ్మలు (కర్మఋక్కులు).

**శ్రీ రామారాయ కవీంద్రులు** శాలివాహన శకంబులు 1797 సంవత్సరము సరియగు యువనామ సంవత్సర మార్గశిర బహుళ అమావాస్య సోమవారము కర్కటకలగ్నము నందు క్రీ॥శ॥ 27 డిసెంబరు 1875 సం॥న ఆళ్వారయ్యకుమారుడైన మోహనరావు, హనుమాంబా పుణ్యదంపతులకు జన్మించిరి.

## మూర్తిత్వము :

బాలుఁడైన రామారావు స్ఫుర ద్రూపి! పుటము బెట్టిన మేలిమి బంగారు తనుచ్ఛాయ! ఎత్తునకు తగిన దేహపుష్టి గలవాడు. నిరంతరము చిఱునగవులు చిందు మోముతో, బ్రహ్మతేజ ముట్టిపడు ముఖవర్చస్సుతో, పిఱుందులు దాటి వ్రేలాడు దట్టమైన సుదీర్ఘ నీలిమధుపచ్ఛదాకేశ సంపదతో, చక్రములవంటి నేత్రములతో, విశాలఫాలముతో నొప్పుచుండెను.

శ్రీ రామారాయ కవీంద్రులు జన్మించునాటికి మోహనరావు అగ్రహారంలో నుండిన సమిష్టి ఆస్తికి యజమాని!

శ్రీ రామారాయ కవీంద్రులకైదాఱేడులు నిండునప్పటికి తండ్రి **శ్రీ మోహనరావు** గారు స్వర్గగతులైరి. భర్తను కోలుపోయిన హనుమాంబ నిశ్చేష్టితయైనది.

## ప్రాథమిక విద్య :

దత్తుబోయిన రంగయ్య కుమారుడును కవిగారి పిన తండ్రియగు కేశవరావు గారు. శ్రీ రామారాయకవీంద్రులను జేరదీసి **"గర్భాష్టమేషు బ్రాహ్మణోపనయాత"** యను శ్రుతిననుసరించి, కుమారునకు నెనిమిదవ సంవత్సరమున నుపవీతునొనర్చెను. వారిని ప్రాథమిక పాఠశాలలో వైచి ప్రాథమిక విద్యనందుత్తీర్ణునిఁగావించెను.

## అనుష్ఠానము :

బాల రామారాయుఁడు బ్రాహ్మీము హుర్తమున లేచి, కాలకృత్యములఁ దీర్చికొని, నత్యంత భక్తి శ్రద్ధలతో సంధ్యావందనమాచరించువాఁడు గ్రామములో ప్రాథమిక విద్య ముగియుటచే కేశవరావుగారు బాలుని హూణవిద్యనిమిత్తము గుంటూరు నగరమున ఆంగ్ల విద్యాలయములో మూడవ ఫారములో చేర్చిరి. బాలుడు శ్రద్ధగా చదువుకొనుచుండెను. విధి చైదములు మహాద్భుతములు. అగమ్యగోచరములు, బాలుఁడు రామారావునకు పాఠశాలకు జనిన ప్రతి దినము శరీరమస్వస్థకు గురియైబాధించుచుండెను. బాలుని మాతామహిగారు బాలుని శరీరారోగ్యంను పరిగణించి ఇంగ్లీషు విద్య మాన్పింప పోరు బెట్టినది.

కేశవరావుగారు బాలునకారోగ్యమును గోరి, హూణ పాఠశాల విద్యను మాన్పించి యింటికి జేర్పించెను. అప్పటికి శ్రీరామారాయునకు పదునాలుగేండ్లు.

## విద్యాభ్యాసము :

రామారాయుండు శ్రీయుతులు శంకర మంచి లక్ష్మీనారాయణశాస్త్రి, సీతారామయ్య గారలకడ సంస్కృతము చదువ జొచ్చిరి. తమ కులపురోహితుల కడ, నమకచమకాదులు, ఉపనిషత్తులు, వేదమంత్రాలు వల్లింప దొడగిరి.

నిడదవోలున కనతి దూరమున గల రామిమల్ల గ్రామ నివాసులు **బ్ర॥శ్రీ॥ పురిఘట్ల సీతారామశాస్త్రి** కుమారులగు **రామశాస్త్రి** గారు కోటిపల్లి నివాసులగు **శ్రీ భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యుండై మహా భాష్యాంత** వ్యాకరణముల జదువ, రెండ కుమారుండు **సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీ గుమ్మడి మూడి సంగమేశ్వరశాస్త్రుల** వారి కడ తర్క శాస్త్రమును గడించెను.

**శ్రీ రామారావు** గారు ప్రథమమున **బ్ర॥శ్రీ॥రామశాస్త్రి గారి** కడ సిద్ధాన్తకౌ ముది నారంభించి సంధిపఞ్చకము వరకు సామాన్య పాఠములుగా చదివి శబ్దాధికారము మొదలు సవివరణ వైశేషిక పాఠములంజదివి, పదపడి సిద్ధాన్తపూర్వపక్షము పాఠము జరుగుచుండ **శ్రీరామశాస్త్రి** గారికి స్వస్థానము నుండి కబురురాగ ఆయన యింటికి వెడలిరి.

**బ్ర॥శ్రీ॥ సుబ్రహ్మణ్యశాస్త్రుల** వారి కడ నహోరాత్రములు తదేక నిష్ఠతో "పూర్వోత్తర పక్ష సిద్ధాన్తరాద్ధాన్తములతో తర్క శాస్త్రాధ్యయనమొనర్చుచుండిరి.

మూడు మాసములు గడిచినవి రామశాస్త్రులు గారు పమిడిపాదునకేతెంచిరి. ఉత్తరార్ధమారంభించి మనోరమ, శబ్దేన్దుశేఖరము పతఞ్జలి మహాభాష్యములను చదివించిరి.

బ్ర॥ శ్రీ రామశాస్త్రి గారును తమ్ముడు బ్ర॥ శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రియు తమ వెంట దెచ్చిన గ్రంథ సముదాయమును శ్రీరామారాయుని కడవిడచి జనిరి.

శ్రీ రామారాయ కవీంద్రుడు గురువులు విడచి వెళ్లిన గ్రంథముల నవలోకించి వ్యాకరణ **సిద్ధాన్తకౌముదికి** నతి సరళముగను, సుబోధకముగను, **"శరద్రాత్రి"** యను వ్యాఖ్యను వ్రాసిరి. **కువలయానందమునకు** వ్యాఖ్య గూర్చిరి.

శ్రీ రామశాస్త్రులు గారు, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులు గారున్నూ ఆ వ్యాఖ్యానములు పరికించి "శ్రీకృష్ణ భగవానులకు సాందీపని మహామునివలె,

మేము నామమాత్రపు గురువులమైతిమని చెప్పుకొని ఈ మహాభాగ్యము మా పూర్వ జన్మ సుకృతముగానబ్బిన" దని యానంద భాష్పాకలితులై శిష్యుని గాఢపరిష్వంగన మొనర్చుకొనిరి.

**వివాహము :**

తదరంతరము **శ్రీరామారావు** గారికి పదునెనిమిదేండ్లు నిండినది. ఎందఱెందఱో తమ పిల్లల నిత్తుమని వచ్చిరి. పిన తండ్రి యగు **శ్రీ కేశవరావు** గారు వచ్చిన సంబంధములను పరికించుచుండిరి. చివరకు పూర్వపు బంధువులను నెల్లూరు టౌన్ హౌస్‌పేట వాస్తవ్యులును జిల్లా సిరస్తాదారునగు **శ్రీ సింగరాజు వేంకటరమణయ్యగారి** ద్వితీయ పుత్రిక యగు **నాది లక్ష్మమ్మను** వివాహము చేయుటకు ముహూర్తమును నిశ్చయించిరి.

**శ్రీ సింగరాజు వేంకటరమణయ్య** గారును వివాహమునకు విచ్చేసిన బంధుమిత్రాదులను గౌరవ సత్కారములతో నమితానందుల నొనరించిరి. ఆ కళ్యాణము 'నభూతో నభవిష్యతి'గా చేసిరి.

వివాహనంతరము నూతన దంపతులను గృహ ప్రవేశమొనర్చుచు **శ్రీ కేశవరావు** గారు కృతకృత్యులై ఆ నూతన దంపతులను వదిన హనుమాయమ్మ కప్పగించెను. అప్పటి వరకు తాను ఆజమాయిషి చేయుచున్న ఎస్టేట్ వ్యవహారముల అనుపానులును ఆదాయవ్యయాలను పరిచయమును చేయుచు 500 ఎకరముల ఎస్టేట్ పత్రములను భూమిని **శ్రీ రామారావు**నకప్పగించెను.

**రచనా వ్యాసంగము :**

పమిడిపాడు గ్రామమున చోడరాజు కాలమందు ప్రతిష్ఠతమైన **శ్రీ రమావల్లభరా జాలయము**నందలి తులసి వనమున కూరుచుండి **శ్రీ రమావల్లభరాయ** స్తుతి **శతకము** సంస్కృతమున రచించెను. **రుక్మిణీ పరిణయ** చంపూ, **రమాపరిణయ** చంపూ, **కందర్ప దర్ప విలాసము** మున్నగు గ్రంథముల రచించిరి.

**పేరు మార్పు :**

రచనా కాలములో తన పేరును **రామారావు** అనుదానిలో **'రావు'**-నకు బదులు **'రాయ'** శబ్దము చేర్చి రామారాయలుగా మార్చుకొనిరి. తదాపి వారిని **శ్రీ రామారాయ కవి** యని వ్యవహరించుట జరిగినది.

**గురునిరాకరణము :**

**"గురు శుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా అథవా విద్య యా విద్య"** అను శృతి ప్రకారం సర్వ విద్యా పారంగుతుండైనను గురూప దేశితము కానిచో **నది అవిద్యతో** సమానమని తలంచిన శ్రీ రామారాయ కవి సద్గురు మూర్తికై వెదుకుచుండెను.

తిరుపతి శ్రీరామానుజ విశిష్టా ద్వైత పీఠాధిపతులును, బెల్లంకొండ వారిచే వంశ పారంపర్యముగా గురుస్థానమున పూజింపబడుచుండెడి శ్రీ పరమ హంస పరివ్రాజ కాచార్య **శ్రీమాన్ త్రిదండి ప్రతివాద భయంకర రంగా చార్య మహాస్వామి** వారు శిష్య పరీవృతుండై పమిడిపాడు గ్రామమునకు వేంజేసిరి. బెల్లంకొండ వారు మేళతాళముల తోను పూర్ణ కుంభముల తోను స్వస్థి వాచనములతోను పూజించుచు ఎదుర్కోలిడి, గ్రామమునకు గొని వచ్చిరి.

ఒక విశాల భవనమున సభామందిరము విడిదిగా నేర్పరచిరి. మహోన్నత పీఠమున నాచార్యుల వారునుపవిష్టులైరి. శిష్యులు తివాచీలు, కంబళ్లపై నాశీనులైరి. శిష్యులైన బెల్లంకొండ వారు ప్రథమమున గురు పాదపూజలొనర్చిరి. పిదప తక్కుంగల శిష్యులు గురుపాదుకాపూజలొనర్చిరి. గురు మూర్తులు శిష్యుల యోగక్షేమములనడిగి తెలిసికొని మంగళా శాసనముల బలికిరి. తదనంతరము ఆచార్య స్వామి ధర్మోపన్యాయము గావించిరి. ఆ అనుగ్రహ భాషణమును అక్కడ చేరిన వారు శ్రద్ధాళువులై వినిరి.

నిత్య నైమిత్తిక పంచాహ్నికములనిర్వర్తించి, సహస్ర గాయత్రీ యనుష్టానము జేసికొని, **శ్రీరామారాయకవీంద్రులు** సభా భవనమునకు వచ్చిరి. వచ్చినదే తడవు కృతాంజలీబద్ధుడై ఆచార్య స్వామిని దర్శించి దరికి చేరి ప్రాంజలులై

యుపవిష్టులైరి. శ్రీరామారాయ కవీంద్రులు పుంభావ సరస్వతీ మూర్తులై యా సభాభవనమున భాసించిరి.

ఆచార్య స్వామి తమ యుపన్యాసములో శాఖా చంక్రమణముతో గురువులకు నొసర్పదగు వందన విషయము ప్రస్తావించుచు **'దోర్భ్యామ్ పద్భ్యామ్చ జానుభ్యామ్, ఉరసా శిరసా దృశా మనసా వచసా చేతి ప్రణామోష్టాంగ ఈరితి'** అనుచు గురు విశిష్టత్వము దెలుపుచు **"శబ్దస్త్వంధ కారేస్యాత్గ్రుశబ్దస్తన్ని రోధకః అన్ధకార నిరోధిత్వాద్గురు రిత్య క్షరద్వయ"** యనుచు చదివి గురువులకు శిష్యులొనర్పదగు నమస్కార విధిని శిష్యులకు పన్యశించినను, నయ్యది.

తన పాదపూజ యొనర్పక సాధారణముగ నమస్కరించి యుపవిష్టులైన **శ్రీ రామా రాయ కవీంద్రుని** భావించి చెప్పినట్లు అక్కడి వారు తలచిరి. కాని నిరంతర అంతర్ముఖుడై తదేక ధ్యానరతుండైన శ్రీ రామా రాయ కవీంద్రునకు తోచినదో! తోచలేదో! శెలవుగై కొనిముభావుడై యిల్లు చేరినను. అతిథిమర్యాదలేలోటు లేకుండా జరుగుచుండినవో లేదో పర్యవేక్షించుచు జాగ్రత్తలు గైకొనుచుండెను.

ఒక పంచాంబ్ధ శుద్ధి దినమున ఆచార్యస్వామి ననుపవీతులను, నవివాహితులను వీడి, తక్కిన వారికి **"సమాశ్రయణ సామాంతర చక్రాంకితములు"** వారియిరు భుజముల దపింపజేయుచు ముద్రింపించుచుండిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులను చక్రాంకనముల గైకొని శ్రీమదష్టాక్షరీ మన్త్రోపదేశమును స్వీకరింపవలసినదిగా నాహ్వానించిరి. ఆచార్యులవారి యాహ్వానమును సుకుమారముగా తిరస్కరించి రామారాయ కవీంద్రులు "తప్త చక్రాంకనము పామరులగు శూద్రుల కను వర్తించు ధర్మము. కాని వేదోక్తమును, వేద విహిత నియములైన సంధ్యా వందన పంచదశ కర్మపునీతులై నిరంతర గాయత్రీ మన్త్రానుష్టానులై బ్రాహ్మీభూతులైన బ్రాహ్మణులకు నది నియత ధర్మము కాదని తెలిపిరి. అలా చేయుట నరక హేతువనియు తెలియజేయుచు. శ్రీమద్రామాను జాది విశిష్టాద్వైత దేశికాచార్య వర్యులు చెప్పిన వాక్యములను నుటంకించిరి.

శ్రీరామారాయ కవీన్ద్రులు తన గ్రంథాగారము నుండి శ్రీమచ్ఛంకర భాష్యము, మను, పరాశర యాజ్ఞవల్క్యాది స్మృతులను దెప్పించి వానిలో ప్రస్తావించిన **"దోర్మూల దాహకమత్యన్త పాపహేతుః"** అనిన ప్రమాణముల జూపింప కుల పెద్దలు "పెద్దల యాచారము సనాతనమైన దానిని ఏలతాదనవలె" నని రాజమార్గము బోధింప **శ్రీరామా రాయ కవీంద్రులు** " శృతి స్మృతి విరోధములైనచో వృద్ధాచారమైనను, సనాతనమైనను పరిత్యజించి పరిహరింప దగినదే" అను చక్రాంకితరహిత మన్త్రోపదేశమునకు నంగీకరింప, ఆచార్య స్వాములు " చక్రాంకన విమతుడు మన్త్రోపదేశ స్వీకృతి కర్హుడుకాడని" పలికిరి.

అంతట ఆచార్యుల వారు **నరసింహారావు** నాహ్వానింప నాతడిట్లనినాడు. "తప్త చక్రాంకిత మన్త్రోప దేశమునందిన వారు పునీతులని మీరనిరి అట్టిచో చక్రాంకన మన్త్రోపదేశ స్వీకారముతో పునీతమైన నా యిల్లాలు వంట జేసివడ్డించిన మన మెల్లరము ఏక పంక్తి భోజనమొనర్పనంగీకరించెదరా" అని నిలదీసెను. దానికాచార్యుల వారు "వృద్ధాచారమట్లు నిర్ణయించలేదు కావున నది నంగీకారయోగ్యము" కాదనిరి.

ఆ పలుకులు విని నట చేరిన వారు అదు వైష్ణవులకును, ఇటు వైదికులకులను దూరమై " యుభయభ్రష్టు" తము కాలేమనియు, నందుచే వైష్ణవ మతమొల్లమనియు పలికి యిండ్లకు జనిరి.

వైష్ణవ మతవిముఖులైన బ్రాహ్మణులు తదాది రుద్రాక్ష భస్మధారణ మొనర్చుచు వైశ్వ దేవాది కర్మల నొనరింప దొడగిరి.

ఆచార్యులు వారు అలిగి శిష్యసమేతముగా పయనమై **శ్రీరామా రాయ నరసింహారావు** గారలంపిన ఉభయముల స్వీకరింపక తిరస్కరించినను దారికర్చులకు నిడిన పారితోషక ధనమును వస్త్రాదులను స్వీకరించిరి శిష్యసమేతముగ నాచార్యులవారిని సగౌరవముగా నరసరావుపేటకు గొంపోయి రైలెక్కించిరి. తదాది ఆచార్య స్వాములు పమిడిపాడు గ్రామమునకు సంచారమునకు రాక మానిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు "తప్తచక్రాంకన ఖండనముగా శూద్ర

ధర్మ దర్పణమును శర్మ పేరు గల ధర్మ శాస్త్ర క్రోడీకరణ గ్రంథమును తమ భాగవత చంపూ గ్రంథ పీఠికయందు దహరించిరి.

## మన్త్రోపదేశము :

తదాది రామా రాయకవీంద్రులు సంధ్యా వందనాది నిత్యానుష్ఠాన కర్మ లొనర్చుచు సహస్రగ్గా యిత్రీ మన్త్రమును దీక్షా దక్షుదై జేయుచుండెను. ఆయన దైవభక్తి త్రికరణ శుద్ధికి (మనోవాక్కాయ కర్మలు) సంతసించి ఒకనొక పుణ్య దివసము మూడవ జాముమున దైవము ఒక వృద్ధ బ్రాహ్మణ రూపమున స్వప్నమున సాక్షాత్కరించి, **శ్రీహయగ్రీవ మన్త్రోపదేశమొనర్చి**, తన్మంత్రానుష్ఠానాంగిక కవచమాలా పంజర యంత్రమూలక సాధనముల బోధించి వివరములు దమ్మాలపాడు నివాసులైన **శ్రీమాన్ రత్నమా చార్యులను** వైఖానసశ్రేష్ఠుల కద దొరకునని చెప్పి అంతర్ధానమయ్యెను. మరునాడు శ్రీరామారాయ కవీంద్రులు దమ్మాలపాడునకేగి శ్రీ రత్నామాచార్యుల వారిని దర్శించి, స్వప్నవృత్తాంతము చెప్ప వారు సంతోష తరంగి తాంతః కరుణులరై మా తాత గారి మన్త్రానుష్ఠాన గ్రంథము కలదని చెప్పి, దానిని కవీంద్రులకిడెను.

ఆ గ్రంథమును నింటికి గొని వచ్చి యందు తెలిపిన ప్రకారము నను సరించుచు పునశ్చరణ గావించెను. దానితో శ్రీరామా రాయ కవీంద్రులు వైదుష్యమునకు తోడుగా ననన్య కవితా వైభవము బంగారమునకు తావియబ్బినట్లయ్యెను.

## తపోయోగము :

**శ్రీ రామా రాయ కవీంద్రులు** మన్త్రోపదేశానంతరము. ఆసన, అనుష్ఠాన జప తప యోగ విధి విధాన విశదమునకై **పాతంజలి యోగ సూత్రముల** నాశ్రయించి తద దుష్ఠితముగా నిర్వర్తించుటకు యోగాభ్యాసనా ప్రవిష్టుడును నకిరకల్లు వాస్తవ్యులునైన బ్రాహ్మీభూతులు **బ్ర॥శ్రీ॥ పాతూరి అక్కంభొట్లు** గారిని రావించికొని, వారి సమక్షమున యోగ సూత్రార్థముల విశ్లేషించికొనుచూ, రేచక-పూరక-కుంభకాది-ప్రాణాయామ ప్రక్రియల నభ్యసించిరి!

ఇంటి దగ్గర తపో భంగ మగుట గని కృష్ణానదీ తటమున సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమగు వేదాద్రికి జేరిరి. ఆ మ్మహా క్షేత్రమున కృష్ణా నదికి నుత్తరమున 1) యోగానంద నరసింహ 2) లక్ష్మీనరసింహ, 3) జ్వాలానరసింహ 4) నదీగర్భమున సాలగ్రామనరసింహ, 5) కొండ గుహలో గారుడ నరసింహములను పంచ నరసింహమూర్తులు వేంజేసి వెలసియున్న సుప్రసిద్ధ నరసింహక్షేత్రము వేదాద్రి!

ఆ పుణ్యక్షేత్రమున మూల వరులకు నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మా సోత్సవ, కళ్యాణాది కైంకర్యములు ముక్త్యాల జమీందారు గారి ధర్మ కర్తృత్వమున జరుగుచుండెను.

ఆ పుణ్య క్షేత్రమున భక్తులు, ఆర్తిజనులు సంతానార్థులు, కామి తార్థులు, తపస్సాధకులు, యోగాభ్యాసులు, అణిమాద్యష్ట సిద్ధుల పడయగోరువారు, పిశాచ బాధితులు, వ్యాధి గ్రస్తులు మున్నగు వాఱెందఱో వచ్చి స్వామిని దర్శించి, అర్చించి కామి తార్థ లబ్ధులై పోవుచుందురు.

వేదాద్రి సిద్ధక్షేత్రము అగుటచే **శ్రీరామా రాయకవీంద్రులు** తమ హయ గ్రీ వోపాసన సంసిద్ధికై తగిన పుణ్యక్షేత్ర మని భావించి **యోగానంద నరసింహ** సన్నిధానమున తపమాచరింప బూనికొనినాడు.

శ్రీ రామారాయ కవీంద్రులు సతీ సమేతుండై శిష్యుండగు బ్ర॥శ్రీ॥ రాళ్లభండి నరసింహశాస్త్రి వెంటరా జనెను.

శ్రీ రామా రాయకవీంద్రులా పుణ్యక్షేత్రమున దీక్షాళువై రెండు సంవత్సరములు తపమాచరించెను. ఉషస్సుకు ముందుగా లేచి, కృష్ణవేణినదికి జని కాలకృత్యములు నిర్వర్తించుకొని, నది గర్భమున కంఠదఘ్నముగా నీట నిలచి శ్రీహయ గ్రీ వోపాసన చేయుచు. ఝాము ప్రొద్దుక్కు నప్పటకి వసతి కేతెంచి, యేకాంతముగా తపస్సాధన నొనరించువాడు.

బద్ధపద్మాసనస్థుడై ధ్యాన యోగమున భూమికి గజమెత్తున పైకిలేచి తపమాచరించువాడు. మన్త్రసిద్ధినందిన **శ్రీరామా రాయసిద్ధ** పురుషుడు శ్రీ

హయగ్రీవ స్వామి వారి యాజ్ఞ ననుసరించి, తర్పణ, హోమాదుల నొనర్చి, క్షేత్రమున గల అశేష భక్త జనులకు కుల మతాతీతముగా అన్న సంతర్పణమొనరించి సఫల మనోరథుఁడై స్వగ్రామమునకు జేరెను.

ఈలోగా పమిడిపాడు గ్రామమున శ్రీరామా రాయకవీంద్రుల భవన ప్రాంగణమున రేఁబవళ్లు **శ్వేతాశ్వమొండు** పరుగులు పెట్టుచు హయహేషలు చేయుచుండెను. ఆ అశ్వవదనము నుండి కాంతి పుంజ సూత్రములు వెలువడుట గ్రామస్థులుఁ గనిరి.

తన భక్తులను స్వామి నిరంతరము యేమరక కంటికి ఱెప్పవలె కాపాడు ననుటకిది నిదర్శనము. ఈ విషయము కాలాంతరమున ఆదిలక్ష్మమ్మగారు (కవీంద్రుల సతీమణి) తమ మనుమలకు చెప్పినట్లు తత్పౌత్రుడు బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ వేంకట సుబ్రహ్మణ్య శర్మగారు భక్తి తత్పరుడై చెప్పిరి.

**ప్రజ్ఞాధురీణత : (రచనములు)**

శ్రీ రామా రాయ కవీంద్రులు షోడశవర్షముల ప్రాయముననే తమ గ్రామమున వెలసిన శ్రీరమా వల్లభ రాయ స్వామివారిపై శ్రీరమా వల్లభ రాయ శతకమును తదుపరి రుక్మిణీ పరిణయ చంపూ, రమా పరిణయ చంపూ, కందర్ప విలాస భాణము, గరుడ సందేశము, శ్రీ కృష్ణ లీలా తరంగిణీ వ్యాఖ్యా, భాగవత చంపూ వ్యాఖ్యా, వేదాన్త కౌస్తుభము, హయగ్రీవస్తుతి, హయవదన శతక వ్యాఖ్య అనేక దేవతాస్తుత్యష్టక శతకాదులు వానికి వ్యాఖ్యలు, శంకర భాష్యాత్మక భగవద్గీతపై భాష్యార్క ప్రకాశిక,శ్రీమద్, భాగవద్భుత శంకరా శంకర భాష్యము సిద్ధాన్తకౌముదికి శరద్రాత్రి వ్యాఖ్య, శ్రీ భాష్యవిమర్శనము, సిద్ధాన్తబిన్దువ్యాఖ్య, సిద్ధాన్త సింధువు, మున్నగు శతాధిక గ్రంథముల వ్రాసిరి.

వాటిలో లభ్యగ్రంథములను విశేషశ్రమకోర్చి నిష్కామియై నరసరావుపేట వాస్తవ్యులు బ్ర॥**శ్రీ॥ కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు** ముద్రించిరి. అవియు నేడు జనబాహుళ్యమున కందుబాటులో లేక, పునర్ముద్రణమునకు నోచుకొనక అసూర్యంపశ్యలైనవి. వానిని వెలుఁగునకు తెచ్చుట ఇటు ప్రభుత్వము వారియు,

స్వచ్ఛంద సంస్థలయు, వ్యక్తులయు కర్తవ్యము. శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రుల ట్రస్ట్ నరసరావుపేట వారు శంకరా శంకర భ్యాష్యమును శ్రీమత్ భగవద్భత భాష్కారడ కాశిక వెలువరించిరి. తక్కిన వానిని శక్తి కొలది ముద్రింప బూనుకొనుచున్నారు.

## వైదుష్యము :

**శ్రీ రామా రాయ కవీంద్రుల** వారి వైదుష్య మనన్య సామాన్య మప్రతిమానము. ఆయన మూర్తీ భవించిన సరస్వతి. ఆయనలో ఒక పాణినిని, వరరుచిని, వాల్మీకిని, వ్యాసుని, కాళిదాసుని, భాణ, భవభూతులను శంకర భగవత్పాదులును, ఒక విద్యారుణ్యుని, ఒక మల్లినాథ భట్టును, ఒక కుమారిల భట్టును మున్నగు వారినెందరెందరనో జూతుము. ఆమహామనీషుల వైదుష్యము వారిలో సర్వరీతుల మూర్తీభవించినది. ప్రథమాక్షరముగా “హ” కారము వచ్చునట్లు హయగ్రీవ సహస్రనామములును “వి”పర్ణ ప్రథమాక్షరముగా విష్ణుసహస్ర నామములను సవ్యాఖ్యానముగ వ్రాసెను.

## ఆరోహ అవరోహణలు :

**శ్రీరామా రాయకవీంద్రులు** తమ దాయాది సోదరుడైన శ్రీ వల్లభరావు గారితో కలసి పద్యములకు పద్యములు, వాక్యాలకు వాక్యాలు, నలవోకగా ననాలోచితంగా, ననాయాసంగా, తడుము కొనకనే తలక్రిందులుగా కుడి నుండి యెడమకు చెప్పెడి వారు. ఒక పర్యాయము పండితుడొకండు కాళిదాస కృత అర్ధ శ్లోకమును పఠింపగా శ్రీరామా రాయ కవీంద్రులు తడుము కొనక వెంటనే దానిని కుడి నుండి ఎడమకు అర్ధ శ్లోకమును చదివి వినిపించెను.

**దాక్షాయణీ దనుజ శిక్షా విధౌ వితత దీక్షామనోహర గుణా భిక్షా శివామనిజపక్షా, వినోదముఖ వీక్షా విపక్ష విముఖో!**

దానిని కవీంద్రుల వారు

**“ఖోముఖి క్షపవి క్షావీ ఖము దనో వీక్షాప జనిమ వాశి క్షాభి ణాగు ర**

**హనోమక్షాదీ తతవి ధౌవి క్షాశి జనుద ణీయక్షాదా"** యని పూరించినందటి నబ్బుర పరచిరి.

ఈ రీతిని వారెన్నియో మారులు పూరించి శ్రోతలకు వీనుల విందు జేకూర్చిరి. అలాగే కవీంద్రులు మరియొక పర్యాయ మొక పండితుండిడిన శ్లోక పాదద్వయమును.

**షడ్వామఢ్ఢ ఖరాఢ్ఢ వీఢ్ఢ వసుధా జ్వాలాంశ్చ మఢ్వా ఖిరే!**
**ఢ్ఢిఢ్ఢే ట్కిట్కి ధరే ఖణఖణా ఖడ్వార విఢ్ఢ ద్రృ మా!**

దానిని కవీంద్రుల వారు

**మా ద్రృ ఢ్ఢవి రడ్వాఖ ణాఖణఖ రేధ ట్కిట్కిఢ్ఢేఢ్ఢి**
**రేఖిఢ్వామ శ్చంలాజ్వా ధాసువ ఢ్ఢవీ ఢ్ఢరాఖ ఢ్ఢమఢ్వాష!**

అని పూరించి భావములను తెల్పిరి వారి ధారణాపటిమకు పాండిత్యమున కందు గల వారు మిక్కిలి కొనియాడిరి. కరతాళధ్వనులతో సభా భవనము మారుమ్రోగినది. అవి అతువు పూరణములు గాననేడవి అలభ్యములు చెప్పిన వానిని ఎవరేని వ్రాసికొనిరో లేదో తెలియదు.

## శ్రార్ధక వివేచనా చర్చ – నిర్ధారణము :

**శ్రీ రామా రాయ కవీంద్రుల** సన్నిహిత జ్ఞాతి యగు **బ్రా॥శ్రీ॥ వెంకయ్యగారు** ప్రథమ భార్య నిర్యాణానంతరము కవీంద్రులవారి పినతల్లిని ద్వితీయ పత్నిగా నుద్వాహము జేసికొనినాడు. మొదటి భార్య వలెనే యీామెయందును సంతానము కలుగలేదు. శ్రీనివాసరావు కుమారుడు **జగన్నాథరావును** చిన్నతనమునందే జేరదీసి పెంచుకొనెను. తదుపరి **జగన్నాథరావుతో** సరిపడక ఏదో నెపమున నాతని జనక స్థానమునకు పంపెను. అప్పటికి దత్తస్వీకారము జరుగలేదు.

తరువాత రెండేండ్లకు వెంకయ్యగారి ద్వితీయ కళత్రము నిస్సంతుగా మరణించెను. అప్పుడు కులపెద్దలందఱు వెంకయ్యగారి నొప్పించి జగన్నాథరావును

పిలిపించి,, ఉపనయన దత్తస్వీకారాదులు జరుగకున్నను. జగన్నాథమునకు వేంకయ్యగారిచే సద్యః కాలావసరముగా దత్తపుత్ర కర్తృత్వక కర్మలు చేయించి పుత్రుని కర్తవ్యమున **వేంకయ్యగారే** అపర కర్మలు మాసిక సాంవత్సరీకాలు చేసిరి.

దత్తపుత్రుండైన జగన్నాథరావు వేంకయ్య గారితో కలహించి యాస్తిలో సగభాగమును పంచుకొని తన భాగముగ సంక్రమించిన యింటిలో విడివడి యుండెను.

జగన్నాథరావు దత్తు తల్లియగు **వెంకయ్యగారి** ద్వితీయ భార్య యొక్క మాసిక, సాంవత్సరిక ప్రథమాబ్దికాలు తన కర్తృత్వముపై జనక తండ్రి శ్రీనివాసరావుచే విడిగా పెట్టించెను.

**శ్రీరామా రాయ కవీంద్రులు** వెంకయ్య గారిని పిలిపించి **"పితృపత్న్యః స్సర్వామాతః"** అను శాస్త్ర వచనం ప్రకారము యిరువురు తల్లులకు అబ్దికములు జగన్నాథ రావే పెట్టవలయునని చెప్పెను.

**నరసింహారావుగారు** దత్త స్వీకారము జరుగలేదు. కనుక వేంకయ్య గారే పెట్టవలెనని వాదన లేవదీసిరి. కొందఱు వెంకయ్యగారే పెట్టవలెననియు, రెండవ భార్య మరణించినప్పుడు సద్యః కాలదత్వ స్వీకార కర్మలు జేసిరి కనుక జగన్నాథరావే పెట్టవలెనని కొందఱును వాద ప్రతివాదనలు చేసిరి. అవును కాదనుచు రెండు వర్గము లేర్పడినది. కొంత కాలమా ప్రథమ భార్యా శ్రాద్ధకర్మలు చేయుట యిరువురు మానిరి.

ఈ వాద ప్రతివాదములు మాన్పుటకు నరసింహారావు కాశికి వెళ్ళి **శివకుమారు భట్టను** పండితుల దర్శించి సమస్య నెఱిగించెను. శివకుమార భట్టరు పండితులు శాస్త్రములు పరిశీలించి కొన్ని శృతి వాక్యములనుటంకించి వేంకయ్య గారే పెట్టవలయునని నిర్ధారించిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు ధర్మ శాస్త్రముల పరిశోధించి కాశీ పండితుడు శివకుమార భట్టరుల వాదమును ఖండించిరి. దానితో కథ మొదటికి

వచ్చి యిరువర్గము లేర్పడినవి.

మాదల గ్రామస్థులు ధర్మశాస్త్ర పాండితీప్రకాండ ప్రచండులునైన **బ్ర॥శ్రీ మేళ్ల చెరువు పేరయ్య శాస్త్రి** వగైరాలను పిలిపించి గ్రామ శివాలయమున ధర్మ నిరూధ సభ గావించిరి.

తర్కధర్మ శాస్త్ర గ్రంథములతో శ్రీరామా రాయ కవీంద్రులును, కాశీ పండితుడు శివకుమార భట్టరు గారిచ్చిన నిర్ణయ ధృవ పత్రములతో శ్రీ నరసింహారావుగారును సభకేతెంచిరి.

శ్రీ నరసింహారావుగారు శ్రీశివకుమార భట్టరు గారిడిన ధృవపత్రముల జూపి స్థానిక పండితులతో కలసి వాదించుచుండ, వారికి ప్రతిగా **శ్రీరామా రాయకవీంద్రుల** వారును వాదమునకు దిగిరి. కవీంద్రులు ధర్మ తర్క శాస్త్రముల పరిశీలించి పరిశోధించి వ్రాసిన **"స్వీకార విధి"** యను గ్రంథమునుండి **శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నాః మహామునీనామ్ మతయశ్చ భిన్నా :** అను సూత్రధారముగా గద్వాల సంస్థాన వార్షిక పురస్కారమునకు జనుచు యిటకేతెంచు పండితుల సమక్షమున తేల్చవలసినదే! యని సామాన్యుల మగు మాధ్యశులకు వలను గాదు. అని సభను అర్ధంతరముగా వాయిదా వేసిరి.

**శ్రీరామా రాయ కవీంద్రులు** వాద ప్రతి వాదముల నకళ్లను తాము వ్రాసిన **" స్వీకార విధి"** అను గ్రంథమును నకళ్ళు దీయించి దేశ దేశములందరి పండిత ప్రకాండలకు పంపుచు వారి నిర్ణయమును తెలుప వలసినదిగా మనవి చేసెను. వారెల్లరు కతిపయ దినములు విచారించి పరిశోధించి శ్రీరామారాయ కవీంద్రుల వాదమే సమంజసమైన దని నిర్ధారించి తెలియజేసిరి.

శ్రీ శృంగేరి పీఠాధిపతులు "పంక్తి " రచనకును, విమర్శకును ఆశ్చర్యమందిరి. స్వీకార విధిని సమర్థించిరి. వారు కవీంద్రుల వారి అసామాన్య ప్రతిభకు ఆశ్చర్యమంది. రామా రాయ కవి **శ్రీ విదారణ్యుల** పంటివారని మెచ్చుకొనిరి. దానితో నరసింహారావు తమ వాదమును మానిరి.

**సమస్యా ప్రదానము :**

ఆకాలమున నరసరావుపేటలో స్వార్థపరులు నీచ రాజకీయములతో "వైదికి – నియోగ" కక్షలేర్పాటు చేసిరి. ఆ దుశ్చర్య వలన బ్రాహ్మణులు రెండు వర్గాలుగా విభజింప బడిరి.

ఆ సమయములో వెలువడినదే **శ్రీ నెల్లుట్లరామ కృష్ణయా మాత్యవిరచిత భావార్ణవము.** దానిలో ఆమాత్యకవి వైదిక జాతిని నుచితానుచితముల గణింపక తూర్పార బట్టెను.

గుంటూరు సీమవాసులు యుగకవులైన **శ్రీతిరుపతి వేంకటేశ్వర శతావధానులకును** కొప్పరపువాసులైన (నాటి నరసరావుపేట తాలుకాలోనిది) శతావధానులు **శ్రీ కొప్పరపు సోదర కవులకును** విభేదముల సృష్టించి తెర మీది కెక్కించిరి. అప్పుడు వెలువడినదే శ్రీ తిరుపతి కవుల **గుంటూరు సీమ.** శ్రీ **కొప్పరపు సోదర కవీంద్రులు** సద్యఃస్ఫురణముగా వందలు వేలుగ పద్యములను ఆశుధా రగ అనన్య సామాన్యముగా అప్రతిమానముగా చెప్పుటచే వారి రచనలు గ్రంథస్థములు కాలేదు. చాలాకొలది భాగమే అయినవి. కొప్పరపు కవులు గంటకు ఐదు ఆరు వందల పద్యములు ఆశువుగా చెప్పెడివారు. కొప్పరపు కవులలో ఒకరైనా చిన్నవారైన **శ్రీ కొప్పరపు బుచ్చిరామయ్యగారు** గ్రంథకర్తకు అష్టావధాన గురువులు.

చివరకు ప్రత్యర్థులిరువురు మధ్యవర్తులైన స్వార్థపరులు కల్పించిన వాదము గా నెఱింగి పశ్చాత్తప్తులైరి "తిరుపతి వేంకటేశ్వర కవులు కొప్పరపువారి విషయములో నిట్లనుడివిరి.

> ఐందరు వచ్చి యచ్చటి సభాసదులన్ దనియించి వారిచే
> జందనమో సుమంబు మతి శక్తికి మించని దేనిగాని మా
> రంది కృతార్థులన్ సలుపుదయ్య! మముస్, మిము జూచు కోర్కెమా
> డెందములందు మిక్కిలి కడిందిగ సందడి చేసెడిన్ జు॥డీ.

అనికోరి తమ పెద్దఱికమును నిలబెట్టుకొనిరి. ఆ సమయములో శ్రీ తిరుపతి కవులను పిలచి నరసరావుపేటలో నవ ధానమునేర్పాటు చేసిరి.

కొందఱు పండితులు పమిడిపాడునకు జని శ్రీరామా రాయ కవీంద్రుల దర్శించిరి అవధానములో పాల్గొనమని కోరిరి. ఆయనందులకియ్య కొనలేదు. వచ్చిన పండితులు శ్రీ రామా రాయ కవీంద్రులను విడువక " మీరొక క్లిష్ట సమస్య" నిమ్మని కోరిరి. అందులకాయన " వారు గొప్ప పండితులు, అవధాన చక్రవర్తులు, అవధాన సమయమున క్లిష్ట సమస్యనిచ్చి వారిని బాధించుట సమంజసము కాదు" అని నిరాకరించిరి. కానీ మరలా కొందఱు వచ్చి బ్రతిమిలాడిరి "క్లిష్ట సమస్యాపూరణము వలన వారి సమర్థత లోకగణ్యమై ఖ్యాతిగూర్చునని" సమర్థించుకొనుచు వెంటపడి వేధింపగా వారిని కాదనలేక తప్పని సరియై శ్రీరామా రాయ కవీంద్రులు **పశ్యాపశ్యౌ నపశ్యతః** అను సమస్యను వ్రాసియిచ్చిరి.

దాని గొంపోయి అవధాన సభలో అవధానులకివ్వగా దానిని చదివికొని శ్రీ వేంకట శాస్త్రిగారు " ఈ సమస్య మీది కాదు శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రులది" అని కన్నుల కద్దికొనిరి. వారు శ్రీరామా రాయ కవీంద్రులను స్వయముగా దర్శింప మదిని దలంచి " ఈ సమస్య తప్పుల తడక" యని తిరుపతి శాస్త్రిగారు నివారింప చుండినను నవ్వుకొనుచు తన అంతర్యము వేరుగాన వేంకటశాస్త్రిగారు సమస్యాపూరణమునకు నిరాకరించిరి.

అంతట పృశ్ఛకులు ప్రతిష్టగానెంచి "సాధుత్వా సాధుత్వముల తేల్చదలంచి పమిడిపాడుకు జని కవీంద్రులకీ విషయము తెలియబరచి వారిని సభలో పాల్గొన వేడిరి. దానికి వారు నాకెందులకీ లౌకిక గోల? ఏదో గ్రంథరచనము బ్రహ్మవిచారముతో జీవితమును గడపదలచిన నాకు వందనీయులగు సరస్వతీ మూర్తులతో నాకీ వివాదముతో పనియేమి? ఆముష్మికమా? మోక్షప్రదమా? నేను రాను పొండు" అనగా వారు మొండి పట్టుపట్టి భీష్మించిరి వారిని కాదనజాలక కవీంద్రులు సభలో పాల్గొననియ్యకొనిరి.

అంత నాపండితులు కవీంద్రులను గుఱ్ఱంపు బగ్గీలో నెక్కించుకొని నరసరావుపేట జేరిరి. తరువాత సభా వేదికపై నొక ఆసనము నేర్పరిచి దానిపై కాషాయంబరము బరచిరి. పాద పీఠికపై నొకముఖమల్ గుడ్డను పరచిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులను సగౌరవముగా గొని నాసీనులగావించిరి. వచ్చిన వారు శ్రీ రామా రాయ కవీంద్రులని తలచిన అవధానులు వారి దర్శనముతో తమ మనోరథ మీడేరినదని తలంచిరి పరస్పరము సగౌరవంగా పూజ్యభావనలతో చూచుకొనిరి.

శ్రీ రామా రాయ కవీంద్రుల శిష్యుడు బ్ర॥శ్రీ॥ ములుకుట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి " **పశ్యాపశ్యానపశ్యతః** అను సమస్యను సాధుత్వా సాధుత్వముల విచారింపగోరిరి. దానికి శ్రీ రామా రాయ కవీంద్రులు బ్రహ్మవిచారము చేసి కొంచు, రచనలను చేసి కొంచున్న నాకు యీ సరస్వతీ మూర్తులతో వాదమేల" అని ఆసనము నుండిలేచి పోయిరి. ఆవాదము రిజష్టర్డ్ నోటీసుల వరకు వెడలినది. పండితులు కవీంద్రుల వారిని బలవంతముగా వాదమునకు లాగిరి. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు పశ్య శబ్దమీమాంసపై **శలభా లభనము** మొదలగు వ్యాసముల ప్రచురించిరి. వారి పక్షమున **బ్ర॥శ్రీ॥ జయంతి భగీరథ శాస్త్రులు** మున్నగువారు పాల్గొని సమస్య అసాధువని ప్రకటించిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు "గుంజా గర్వ భంజనము" "పంచానన పలాయనము" మొదలగు వ్యాసముల వ్రాసి తద్వార తన వాదన వినిపించిరి.

మహామహోపాధ్యాయ **బ్ర॥శ్రీ॥ తాతా సుబ్బారాయశాస్త్రులు** గారు శ్రీ రామా రాయ కవీంద్రుల వాదమునే సమర్థించి "సమస్యసాధునని" ప్రకటించిరి. జంట కవులు తమ వాదమునకు సమర్థించుకొనుచు.

పాణి – సూ : **అతశ్చో పసర్గే**................ అను సూత్రమున నుండి " ఉపసర్గే" అను పదము దాని తరువాతదైన

సూ: **ప్రాఘ్రామార్మారేట్ దృశశ్శః** .................. అను సూత్రములోనికి అనువృత్తిగా వచ్చి కలియును, ఆకారణమున నుపసర్గ మీద నుండగా **పాఘ్రామార్మారేట్ దృశశ్శః** అను నైదు ధాతువుల కంటే పరముగా శప్రత్యయము వచ్చును. పిదప సూ॥ **పాఘ్రాధ్మాస్థామ్నాదాణ్ దృశ్యర్తిసర్తి శద సదామ్ పిబ జిఘ్రధమ తిష్ఠ మన యచ్ఛ పశ్యర్ఛ** దౌశీయసీదాః అను సూత్రము ననుసరించి "పా" ధాతువునకు **"పిబా దేశము"** వచ్చి " **అనుపిబః, ఘ్రాధాతువునకు**

**"జిఘ్రా దేశము"** వచ్చి సుజిఘ్రూః యను **'ఘ్రా' ధాతువునకు ధమా** దేశము వచ్చి విధమఃయును ధేట్ పానే " **యనుధాతువునకు" ధయా దేశము** వచ్చి **అనుధయః** యును దృశిక్ **"ధాతువునకు"** పశ్యాదేశము" వచ్చి **"ఉత్పశ్య"** అనియు **"విపశ్యః"** అనియు రూపము లేర్పడును. అంతేకాని కేవలము **పిబఃజిఘ్రః ధమః దయః, పశ్యః** అను రూపములేర్పడవని **"కాశికావృత్తి** కారోది ప్రాచీన **వైయ్యాకరణమతము"** అని తమ వాదమును సమర్థించుకొనిరి.

ఇక శ్రీ రామారాయ కవీంద్రుల మతమునమసరించి నూతన విధాన వాద మేమనగా **"అతశ్చోగపసర్గే"** అను సూత్రములో నుండిన "ఉపసర్గే" యను పదము తరువాత సూత్రమైన **"ప్రాఘ్రాధ్మాదేట్ దృశశ్యః"** అనిన సూత్రములోనికి అనువృతింగాదు. ఉపసర్గ రహితమైన **'పిబః, జిఘ్రః, దమః, దయః, పశ్యః'** అను శబ్దములు అసాధువులు అని శ్రీ భట్టోజీ దీక్షితులు మున్నగు నవీన వైయ్యాకరణులమతము **"ఫలాని ధూమస్య ధయాన్"** యిత్యాది "శ్రీహర్షమహాకవుల ప్రయోగములును కలవు.

పైవాని ననుసరించి **"పశ్యా పశ్యో నపశ్యతః"** అనుదానిలో **"పశ్య"** శబ్దము సాధువైనది. పూర్వ వైయ్యాకరణ మతముల ప్రకారము 'పశ్య' శబ్దము అసాధువైనను నూతన వైయ్యాకరణ మతముల ప్రకారము సాధువైనది. అందుచే నాటి 'తప్పు' న్నేటి 'ఒప్పు' అయినది అని ప్రతివాదము చేసిరి.

తరువాత అయిదు మాసములనంతరము **శ్రీ తిరుపతి వేంకటేశ్వర శతావధానులు** "యః**పశ్యతి జగత్సర్వం యోన పశ్యతి సర్వతః! తావు ఖౌపరమాత్మానం పశ్యాపశ్యో నపశ్యతః"** అని వ్రాసి ప్రచురించిన **పశ్యశబ్ద విచారః** అను వ్యాసమును ఖండించుచు, ఆపూరణము సరిగాలేదని శ్రీ రామా రాయ కవీంద్రులు **"గుంజాగర్వభంజనమ్ – పశ్యానన పలాయనము"** అను గ్రంథములందు రమారమి పదునెనిమిది రీతుల నాసమస్యను పూరించి వాటిని వ్యాఖ్యాసహితముగా వ్రాసి ప్రకటించిరి. మరియు అనేక సమస్యలను గల్పించి వానికి పూరణములు గావించుచు **"సమస్యారత్నాకరమ్"** అను గ్రంథమును వ్రాసిరి. ఆంధ్రుల దురదృష్టమో యన ఆగ్రంథము నేడు అలభ్య సాహితీ భండారము.

ఆధునిక తెనుగు జాతికి గురువరులై శతావధానులై కింకవీంద్ర ఘటాపంచాననులైన తిరుపతి వేంకటేశ్వర కవులకు రామారావు గారన్న మిక్కిలి గౌరవము. వారు చెప్పిన యీ క్రింది పద్యములే తార్కాణము.

కలందు ప్రసిద్ధ వంశ్యుఁడరి కాండము సైతము మెచ్చుదగ్గ దీ
బలమున కిక్క యా "పమిడిపాటి" నివాసి యశస్వి, త్యాగి, ని
ద్యలకు నిధాన; మంచి, కవితా వనితా హృదయంగముండు, పే
ర్వెలసినా రామర్యావనెడు బెల్లముకొండ కులీనుఁడున్నతిన్॥

అతనికిమా యెడన్ మఱియు నాయన యందున మాకు విన్కిమై
నతితరమైన 'పేర్మియల రారెడి నప్పురిలో వధానమున్
గుతుకముమై నొనర్చి కనుగొంద మటంచు దలంచు చుంటి; స
ట్టితఱినిఁ; బెట్టె నొక్కఁడు కడిందిగ గయ్యము దయ్యమున్ బలెన్

కలహము పెట్టు మానిసియు గవ్వకు సాటియుగాడు, కాడు, పై
నెలమిని వాని నూతగొన్ని మెన్నియొ ముగ్గులుపెట్టు, చెట్టు – నీ
డల మురిపెంపు జీవనపు డక్కరు లాతని పాటివారె ! య
య్యలఘుడు రామ రావొకడె యాధ్యుడు సర్వవిధాల శాంకరీ!

అతడింట నుండి యే ! పం
డితులం బిలిపించి విద్యనేర్పెన్ శాస్త్ర
స్మృతి ముఖ్య సంస్కృత కళా
గతి ససదృశ్యుడంతె కాదు కవితాన్వితుడున్

– యుగకవుల గుంటూరు సీమ నుండి

శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు, శ్రీరామా రాయ కవీంద్రులను బందరునకు వచ్చి సత్కారములంది, కృతార్థులను నొనరింపుమని కోరిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు విశ్వశ్రేయః కాములు, ఆనాడు పెల్లుబిక నియోగి – వైదికులు వైషమ్యములకును, వాని వలన కలిగిన అనుచిత పరిణామములకు మిక్కిలి బాధను పొందిరి. వారిని సన్మార్గములో పెట్టి

సన్మార్గమున నడుప **"నియోగి-వైదిక జనహితోపదేశమ్ - బ్రాహ్మణ శబ్ద విచారమ్"** అను గ్రంథముల వ్రాసి ప్రకటించిరి.

తత్ఫలితముగా నియోగి-వైదిక కక్షలు మాని పశ్చాత్తప్తులై విప్రులు ఒక త్రాట నడచుటకు శ్రీ కవీంద్రుల వారే కారణము.

శ్రీ రామా రాయ కవీంద్రులు తమ యింటి అవసరమైన కలపను కొనుగోలు చేయుటకై రాజమహేంద్రవరం చేరి రాజమహేంద్రవాసులును శ్రీ శంకర భగవత్పాదుల పోలిన వారునగు **"బ్ర॥ శ్రీ ఆదిభట్ల రామమూర్తి శాస్త్రుల"** వారిని శ్రీ రామా రాయకవీంద్రులు దర్శించి తాము వ్రాసిన **భగవద్గీత భాష్యార్క ప్రకాశికను** గురించి తెలుపగా ముఖ్యముగు శ్లోకములకు కవీంద్రులు వ్రాసిన వ్యాఖ్యానము చదివి వినుపింపుమనిన శ్రీరామమూర్తి శాస్త్రుల వారి యాదేశ ప్రకారం వినిపింప సంతసించి, కవీంద్రుల ప్రతిభను తాను వినిన దానికంటే ప్రత్యక్షముగా వేయిమడుంగులధికముగా దోప శ్రీ శాస్త్రుల వారు కుమారిలభట్టు ప్రథమమున జైన బౌద్ధాదిమతాద్యవైదికముల ఖండించి కర్మమతమును స్థాపింప, శ్రీ శంకర భగవత్పాదులువారు కర్మ మార్గమును ఖండించి యద్వైత స్థాపింప, శ్రీరామానుజులు ప్రభవించి అద్వైత ఖండనమొనరింప, శ్రీమధ్వాచార్యులవారు ద్వైతమును స్థాపింప, తాము ద్వైత, విశిష్టా ద్వైతములను శ్రుతి స్మృతుల నాధారముగా గొని ఖండించి వ్రాసిన వ్యాఖ్యానము, విమత తమో హరణ రూప జ్ఞాన భాస్కరోదయమై విరాజిల్లుచున్నది. మీ యందు గల బ్రహ్మతేజము, నఖండ పాండిత్యము, కుశాగ్రబుద్ధి పిన్న వయస్సుననే తాము అఖండాద్వైత మత స్థాప కత్వమును జూడ మీరు వ్యాసులో, ఆదిశంకరులో యనునట్లు దోచుచున్నారు. ఇది ముఖప్రీతి వచనములు గాదు హృదయ కుహరములో నుండి వెలువడిన త్రికరణశుద్ధి యుతములైన పలుకులని శ్లాఘించిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు రాజమండ్రి నుండి తెచ్చిన కలపతో ఒక భవనం నిర్మించిరి.




పమిడిపాదులోని కవీంద్రుల గృహము

తరువాత వ్యాసరచిత **శారీరక చతుస్సూత్రీమున్నగు** అద్వైత గ్రంథములెన్నియో వ్రాసిరి. పంద్రెండు యుపనిషత్తులలోని 783 శ్లోకములకు సవివరణలతో కూడిన వ్యాఖ్యానమును 29 దినములలో వేదాంత ముక్తావళియను పేర వ్రాసిరి. చిన్నవి, పెద్దవియు కలసి 148 గ్రంథములు రచించిన శతాధిక గ్రంథకర్తలు శ్రీరామా రాయ కవీంద్రులు.

వారి గ్రంథములు చాలా వరకు గుంటూరు నివాసి వదాన్యశేఖరులు కవిజన పక్షపాతులునైన బ్ర॥శ్రీ ఏకా ఆంజనేయులు పంతులు గారు ముద్రించిరి.

## శరీరారోగ్యము :

శ్రీరామా రాయ కవీంద్రుల వారు నా బాల్యమాదిగా అజీర్ణ వ్యాధి గ్రస్తులు! దీనికి తోడు 32 సంవత్సరములు వచ్చునాటికి మధుమేహవ్యాధి యేర్పడినది. వీరి నిరంతర గ్రంథ రచనాసుసక్తి. దీనితో వ్యాధి ముదిరినది. ప్రసిద్ధ వైద్యశిఖామణుల చికిత్సకును లొంగక పోయెను. సన్నిహితులు శిష్యుల ప్రోద్బలముచే మదరాసునంగల భిషగ్రత్న పండిత **శ్రీ డి. గోపాలా చార్యుల** యొద్దకు జనిరి. ఆచార్యుల వారు పరీక్షించి "మీరేమి చేయుచుందురన" నిరంతర

గ్రంథ రచనా లాలసుండనని సమాధాన మిడిరి. అంత ఆచార్యుల వారు "మీరు కొంత కాలము గ్రంథరచనకు స్వస్తిపలికిన చికిత్స చేసి నయము చేయగలనన" నాకీ వ్యాధి నాస్థూల శరీరమును కృశింప జేయు చున్నది గాని, సూక్ష్మ శరీరమును కాదు. కనుక ప్రాణోత్క్రమణ పర్యంతము గ్రంథ రచనా వ్యాసంగమే నాకు పరమావధి. దానికాటంకము కలుగకుండాచేయగలరా యని అడిగిరి . దానికాచార్యుల వారు కొంత కాలము సూక్ష్మ శారీరకర్తృక వ్యాసంగమునుమాని, ధర్మ సాధనమగు స్థూల శరీరమునకు స్వస్థత చేకూర్చుకొనుట మంచిది గదా! అది అవశ్యము కూడాను, అనగా కవీంద్రులు వారితో " స్థూల శరీరముచే సాధింపదగినది పూర్వమే సాధించితిని సూక్ష్మ శరీర భంగకారణమగు బ్రహ్మవిచారమే సాధింపదగినది" అనగా ఆచార్యుల వారు అమితానందకందళిత హృదయారవిందులై విస్మయ దృక్కులతో చూచుచు నమస్కరించి "బ్రహ్మవేత్తలగు మిమ్ము బ్రహ్మవిచార రసాయన మొక్కటియే కడ తేర్పగల యౌషధమని సవినయముగా పలుకి పంపగా కవీంద్రులు స్వగ్రామమును చేరిరి.

కవీంద్రులు శరీరమున వ్యాధి ముదిరినది. కానీ వారి మనో బలము తగ్గలేదు. ఒకనాడు కవీంద్రుల భార్యయగు **ఆదిలక్ష్మమ్మ** గారు అనునయ వచనములతో మంత్రాంగము నెఱపి "జ్ఞాతిబాలునొకని దత్తత తీసికొనండి" అని సలహానివ్వ, అయన చిఱునవ్వు చిందిస్తూ " **శబ్దేన్దుశేఖరః, పుత్రో, మంజూషా మమ పుత్రికా"** యని **నాగేశభట్టుగారు శబ్దేన్దుశేఖరమను** నారచించిన వ్యాకరణ శాస్త్ర గ్రంథము నాకుమారుడనియు, **మంజూషయను** గ్రంథము నా కుమార్తె యనియు నుడివిన వడి, నా రచనలైన 148 గ్రంథములు నాకు సంతానముగా నుండుగా, అర్థాపేక్షతో దరిం జేరు దత్త సంతానము మనకేల? " అనిచెప్పి అనునయించిరి.

శ్రీ రామా రాయ కవీంద్రులు వయోవృద్ధురాలగు తల్లికిని, అను పాయినియై సర్వ శుశ్రూష లొనర్చుచు సేవించు చుండిన పతివ్రతా శిరోమణియైన భార్య ఆదిలక్ష్మమ్మ గారికిని దత్తత జేసికొన్నందు వలన మున్ముందు యెదురగు బాధలను ఇబ్బందులను తెలియుపరచి దత్త స్వీకారమునకు విముఖత జూపెను.

## చరమదశ :

ఒకనాటి రాత్రి శ్రీ రామా రాయ కవీంద్రులు భోజనానంతరము మూత్ర విసర్జనకు నింటి ముందటి దొడ్డిలోనికి జనిరి. అచట కాలి మడమకు తేలు కుట్టి నట్లయ్యెను. కాని తేలు కుట్టిన విషము పైకి బ్రాకి బాధించుటలేక, కుట్టిన తావున మాత్రమే బాధించుచు నుండుచుండెను.

ఆ రాత్రియంతయు నేవేవో చికిత్సలు చేసి, వేడి నీటిలో కాలుంచిరి దానితో బాధ కొంత ఉపశమించెను.

తెల్లవారు నప్పటికి మడిమను పరిశీలింప వేపగింజ పరిమాణమున తెల్లని బొబ్బ గన నయ్యెను. శిష్యులు, మిత్రులు బంధువులు కవీంద్రులను ప్రయాణము చేయించి గుంటూరు పట్టణములోని ప్రభుత్వ హాస్పటల్ సర్జన్ గారికి చూపింప మందువైచి కట్టును గట్టిరి. మరునాడు ఉదయమునకు ఆ బొబ్బ చిటికి నంగుళము మేర తెగ దిని నరములు గాన్పించెను. అదిగాంచి పరీక్షించిన శస్త్ర వైద్యుడు" ఇదిరాచపుండు (దీనినే నేడు కాన్సర్ అంటున్నారు) దీనికి చికిత్స లేదు. కుదరదు ఇంటికి గొని పొండని చెప్ప, శ్రీ రామా రాయ కవీంద్రులు బంధుమిత్రాదులతో యిల్లు జేరిరి.

పిన తండ్రి కుమారుండగు **నరసింహారావు** గారు పూర్వ జ్ఞాతి ద్వేషమును వీడి కవీంద్రుల దర్శించి " ఎట్లున్నదిరా రామా" అనగా స్థూల శరీరమును జాగ్రదావస్థలో నభిమానించు చుండిన వరకు బాధగానే యుండును. అని చెప్పిరి. క్రమ క్రమముగా స్పృహ తప్పు చుండెను. అది గని **నరసింహారావు** గారు సన్నిహిత జ్ఞాతుల నందఱిని రావించి వారితో చర్చలు జరిపెను. శ్రీరామా రాయ కవీంద్రుల యాస్తిని మూడు సమభాగములుగా తల్లికిని, భార్యకును, మేనల్లునకును, విభజించి వీలునామాను వ్రాయించి శ్రీ కవీంద్రులకు చదివి వినిపించి వారిచే సంతకము చేయించెను.

## మహా ఘరి నిర్యాణము :

భువిపై జన్మ నెత్తిన ప్రాణి మరణింపక తప్పదు. ఎంతటి వారికైన

మరణ మనుల్లంఘ్య నీయము. మరణ దేవతకు చిన్న పెద్దయను తారతమ్యము లేదు.. సమతావాది.

రాజ రాజుల మొదలు బైరాగివరకు
ధన ధనా ధిపు మొదలు నిర్ధనుని దాక
శూర సింహుని మొదలుగ భీరు వరకు
సమత నాతిథ్య మిచ్చెడి సామ్యవాది!

అనిన ప్రకారము దృగ్గోచరమగు ఈ చరాచర జగత్తు నశింప వలసినదే! విధి యాన అనుల్లంఘ్య నీయము. మరణము ఎంతవారికిని తప్పదు.

శ్రీ రామా రాయ కవీంద్రులా మరునాడు ప్రమాదీచ నామ సంవత్సర కార్తీక శుద్ధ నవమి స్థిర వాసరము శాలివాహన శకంబులు 1836 క్రీ॥శ॥ 27-10-1914 సంవత్సరమున సూర్యుండస్తాద్రికి చేరుటకు రెండు జాములకు పూర్వము తన ముప్పదితొమ్మిదవ యేట జ్ఞాన భాస్కరు దస్తమించి సాహి^ి లోకమును నంధకార బంధురము గావించెను.

సూచన : కొందఱు చరిత్ర కారులు శ్రీ రామారాయ కవీంద్రులు పరీధావి నామ సంవత్సరమని వ్రాసిరి. కానీ, వారి శిష్యుండగు బ్ర॥శ్రీ॥ లంతా సుందరరామ శాస్త్రి గారు ప్రమాదీచ సంవత్సరమనియు వ్రాసిరి. నేను విచారించి ప్రమాదీచగా నిర్ధారించివ్రాసితిని.

## శ్రీరామా రాయ కవీంద్ర కృత శ్లోకాని :

శ్లో॥ భారద్వాజస గోత్ర రామ కవి హృత్పద్మాన్తర స్థో హయ
గ్రీవోరామ ముఖేన సత్కృతి మీమాం వేదాన్తముక్తావళీమ్
కృత్వాత్మీయ గళే నిధాయ ముదితస్యాపాంగ ముక్తావళీ
మాలక్ష్మాత్మని సంగతాం ప్రముదితో రామః పరంచా భవత్॥

శ్రీరామ శ్రుతి శుక్తి గర్భ జనితా న్యేతాని ముక్తాఫలా
న్యానంద్యభ్యసు నిర్మలాని విమలై శార్దూల విక్రీడితైః

సూత్రైస్తే గళ మర్పితుమ్ కలయతే చిత్తమ్ మదీయం ముదా
కారుణ్యా దనుకూలతామ్ మయి భజత్వమ్ మేస్తి నాన్యాగతిః

శ్లో॥ సత్యమ్ జ్ఞాన మనన్త మిత్య జగిరో యోగోచరో గోచరః
స్వాన్త స్వాపి చయః పితాఖిల పితు స్స్వబ్రహ్మణో బ్రాహ్మణః
అధ్యాస్తే జఠరం చయస్య జగదబ్జో హ్యాత్సతోహ్యాత్సతః
సోఖూర్ధూర్ధ్ని బర్హ నిర్మిత శిఖా దామాధవో మాధవః

– పై శ్లోకాలు కవీంద్రుల కవితోద్యానప్రసూనాలు

శ్రీమతే హయగ్రీవాయ నమః

**శ్రీవిశ్వరూపగద్యమ్ :**

హరిఃఓమ్–యో విలయ సమయే శ్మశానభస్మావలిప్తాస్త్రాది విభూషణ! భువనభీషణ! విరూపేక్షణ భ్రుకుటీ తరంగ కరాళ ఫాలపా థోధిలోచన బడబానల! బడబానల జ్వాలా విలాస దంష్ట్రా! కరాళ ముఖ వీతిహోత్ర జ్వాలాయ మాన జిహ్వా భయంకర తీక్ష్ణకర సంతాన, తీక్ష్ణకర సంతాన పరిపీతసర్వరస విరోచనకదంబ! విరోచన కదంబ జిత్వర ప్రకాశ భువన వన కబళ నవ్యసన శిఖా జిహ్వా సహస్ర వీతిహోత్ర! వీతిహోత్ర శిఖాభి వర్ధన ఝంఝూ వాత్యా పరిభ్రామ్య మాణ సకల భూ భూధర పాథోధి స్థావర జంగమ సంక టాజాండ మాతరిశ్వ. మాతరిశ్వ సంక్షోభిత నిజ మండల నిరవకాశ స్వర్భా గర్భస్థ సమ స్తాకాశ పరివ్యాప్త. బ్రహ్మాండ ఖాండ పరి స్ఫోటక నిర్ఘాత ధృతేంద్రచాప. పరిపుష్ట పాషాణ సందోహ నిరంతర వజ్ర పాత భస్మీ భూత సకల వసుంధ రాధర మహేంద్ర నీల సంహనన కాంతి సంతా నాగారీ కృత త్రిభువన మహోజల ధరమండల మండలీ భూతైకోన పంచాశ న్మరు ద్గణ క్షోభిత వేలా తీత తరంగ దుత్తుంగ తరంగ సంఘ సమాక్రాంత నిఖిల కాండ పాథోధికాండ. కాండ సంజాత నిరవకా శాకాశ కుహర పరి పూరక దుర్నిరీక్ష్య జ్వాలా దహ్యమాన పితా మహాండ బడబాగ్ని నిర్వర్తిత సకల భువన వలయ విలయే. స్వనిరీక్షణ భస్మీ భూత రుద్ర భాస్కర. భాస్కర, తనూజాతా, తనూజాత సమీర. సమీరమిత్ర బాడబ వీతిహోత్ర పాథో ధర. పాథో నిధి పరిఘే నిరవకాశా. కాశ కుహర పురి పూర కాంధ కారబహంళే. స్వదుర్ని రీక్ష్యా

ప్రభా పహ్నా తాంధకార సమూహా స్సన్నేకః పరంజ్యోతి స్స్వరూపేణ బహు దివ్య వత్స రానువాస.

యః పున రుపావృత్తే స్సృష్టి సమయే మాయ యా బహు భవన సంకల్పేన చేత నాచేత నా జగత్కారణీ భూత మహ దాది త్రయో వింశతి తత్త్వ సముదాయం. సృష్ట్వా పరస్పర స్పర్థయా పరస్పర మమిశితం తద్గుణంత త్ర్యార్థనానుగుణం సంఘటయ్యా తమ జీవకుం (మం) డం జీవరూపేణ ప్రవిశ్య జీవయన్ స్వసంకల్ప నిర్వర్తిత కాలవశ పరిపక్వా త్తస్మాదండా న్నిర్గత్య సకలాధారోప్య నాధార స్వనివాసాధారీ భూతా ఆపస్స్ర్యష్ట్వాతా స్వనేక దివ్య త్సువరానుషిత్వా తేన నీర నివాసేన నారాయణ సంజ్ఞామ వాపతం నారాయణ సహస్రశీర్షానన నయన శ్రుతి నాసా వక్త్ర బాహూరు రుజా నుజంఘాంఘ్రిం-పాద మూల పార్ష్ణిది ప్రపద గుల్ఫ జంఘ జాను సవ్య వామోరు జఘననా ఖ్యురో గ్రీవా వదన లలాట శీర్షె - పాతాళ రసాతల మహాతల తలా తల సుతల వితలా తల మహో తల సభ స్తల స్వస్తల మాత్తల జనతల తాపస్తల సత్యత లానిదధతం - ఆననే వాగ్వహ్నిత్వ గాం సప్తధాతుషు గాయత్ర్యాది సప్త ఛృందాంసి - జిహ్వాయాం హవ్య కవ్యా మృతాన్న సర్వ రస వరుణా- నాసాయాం సర్వాసువా యా - ఘ్రాణే ఓష ధ్యశ్వి మోద ప్రమోదా. చక్షుషు రూప తేజసీ. అక్షిణి ద్యుసూర్యౌ. కర్ణేది కీర్తాని, శ్రోత్రే గగనశబ్దౌ. గాత్రే వస్తుహార సౌభాగ్యే. త్వ చిస్పర్శ వాయు యజ్ఞా, రోమసు యజ్ఞ సంభూ తోద్భిజ్జజాతః కేశేషు మేఘాశ్చ, శ్రుషు విద్యుతః. నఖేషు శిలా లోహా. బాహుషు క్షేమత కర్మ లోకపాలా విక్రమే భూర్భు వస్స్వః క్షేమశరణాని, చరణే సర్వకామవరా, ప్రజా పతా వచ్చిర్య పర్జన్య సర్గ ప్రజాపతీ, ఉపస్థే ప్రజా త్యానంద నిర్వృతీః, పాయౌ యమ మిత్రప విమోక్షణాని, గుదే హింసా నిర్వృతి మత్యు నిరయా, పశ్చిమే పరా భూత్య దర్మత మాంసి, నాభీషు నద నదీః, అస్థిసు పర్వతాః హృదయే అవ్య కర్త రసిందు భూత నిధనమనాంసి, అత్మ విదర్శ చతుర్ముఖ సనక సనందన నారదాది ఋషీన్ ప్రభవసక్త్వా విజ్ఞానాని ధరంతామ్, త్ర్యక్ష షడ క్షాష్టాక్ష ద్వాద శాక్ష సహస్రాక్ష పింగాక్ష, ప్రాణి శిక్షక సర్వభక్ష కామ్యతో క్షక సముద్రే క్షిత్యరక్షః పతి నక్షత్ర గ్రహ తారా జగత్ప్రాణ ద్వాద శాత్యాది సకల దేవ స్వరూపమ్. సనక సనందన సనత్కుమార సనత్సుజాత మరీచ్యత్ర్యంగిరః, పులస్త్య పులహక్రతు, భృగు, వశిష్ఠ, దక్ష, నారద, చ్యవన, శరద్వ, దరిష్టనేమి, పరాశర, విశ్వామిత్ర, రామో, ఛద్యేంద్ర, ప్రమథేద్మ, వాహ,

మేధాతిథి, దేవతార్శి, జిషేణ, భరద్వాజ, గౌతమ, పిప్పలాద, మైత్రే యౌర్వక, కపష, కుంభయోని, ద్వైపాయన, ముచికుంద, జమదగ్ని, జనక, శతానం, దాంబరీష దుర్వాస, స్వుతీక్షణ, శరభం, గారుణ, నర, నారాయణాది దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి , స్వరు... సురా,సుర, నర, నాగ, ఖగ, మృగ, సరీస్రుప, గంధ, ర్వాప్సరో, యక్ష, రక్షో, భూతగణో, రగ, పశు, పితృ, సిద్ధ, సాధ్య, విద్యాధర, చారణ, మత్స్య, మకర,ఖేక, కమఠాది, సకల, జల, స్థల, నభస్త, కాక, స్సత్వ్య, స్వరూప(క)మ్॥ తటి, న్మేఘ, సంధ్యా, మేరు,హిమ, వసు, మంధర, వింధ్యాద్రి, నద,నదీ,నాద, నదీపతిస్వరూపమ్॥ భూత, భవ్య, భవత్, స్థావర, జంగ, మాత్మకం, స్వరాజం, విరాజమ్॥ బ్రహ్మేంద్రా, విభూతీనాం, రామ, కృష్ణా, ద్యవతారాణాంచ, మూలకంద, ముకుంద, పరమానంద, మగణ్య, గుణ, గణ, మహోదధిమ్, కరుణానిధిమ్, భక్తవత్సలమ్. శ్రీవత్స, లక్ష్మణం విభూతి ద్వయ విభ్రాజ మానసమ్ రవి, సహస్ర విభ్రాజ మాన తేజమ్॥ హృదయాకాశ, మహాకాశ, పరమాకాశేషు, భాసమాన మనమానమ్॥ దివ్య మంగళ విగ్రహమ్॥ పురుష మంగుష్ఠ పరిమాణంచ నానా కార మనాకారమ్॥ జ్ఞానైకా కారంచ పరమాత్మన, మఖి లాత్మన మహమ్॥ సర్వదా సర్వభావేస శరణ మనన్యాశరణమ్॥ ప్రపద్యే!.

– తీక్షణ కర సంతానోయమః

ఇతిః

శ్రీ బెల్లంకొండ రామ రాయ కవి విరచితమ్.

(స్వధర్మ ప్రకాశిని నుండి)

## శ్రీ రామా రాయ కవీంద్రుల గుణ సంకీర్తనము :

సీ॥ అనవర తాన్నవిద్యా దానతృప్తవి
ద్వార్తి విరాజ ద్గృహాంగ ణుండు!
వ్యాకృతి తర్క వేదాన్త మీమాంసాది
రమణీయ శాస్త్ర పారంగతుండు!
సకల విద్వజ్జన స్తవనీయ విషయవి
భాసిత ప్రతిమాన భాష్య కర్త

సరస సంస్కృతి కావ్య చంపూ ముఖ శతాధి
క గ్రంథ నిర్మాణ కలిత యశుండు!
వినుత దుర్వాద కానన వీతిహోత్రుం
డాత్మవిజ్ఞాన వర్తి! సత్య వ్రతుండు!
హరి బెల్లము కొండ వంశాబ్ధి విధుండు
రామ రాయ కవీంద్రుండు! ధీ మహితుండు!

## చీరాల శతావధాన సందర్భమున

బాలసరస్వతి – ఆశుకవీంద్ర సింహ– విజయఘంటికా– ఆశుకవి చక్రవర్తి కుండిన కవిహంస– కవిరత్న– అవధాని పంచానన– కథాశు కవీశ్వర. ఆశుకవి శిఖామణి శ్రీశ్రీశ్రీ కొప్పరపు కవీంద్రులు ( శ్రీ కొప్పరపు సుబ్బారాయ కవి, శ్రీ కొప్పరపు వేంకట రమణ కవులు) బ్ర॥శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రులను గురించి చెప్పిన స్తుతి.

సీ॥ అత్యుగ్రకు కవి పంచాన నంబులు పలా
యన మంద శరభాంక మంది నాండు!
సకలాభినుత శబ్ద శాస్త్ర పారావార
మున కగ స్త్యఖ్యాతిఁ బూని నాండు!
అఖిలాగ మాంత రహస్యార్థమునకు ది
వ్యాంజనమను ప్రజ్ఞనంది నాండు!
భవ్య బెల్లము కొండ వంశ వంతమునకు
ముక్తా ఫలంబన బొసఁగి నాండు!
శిష్య సమితికి విద్యలు చెప్పినాండు
గురు యశంబందినాండు శ్రీ కొండవీటి
సీమ కాభరణంబన జెలఁగినాండు
రామ రాయాఖ్యసుకవి సుత్రాముండీవుడు.

**అశ్రుతర్పణము :**

శ్రీ రామా రాయ కవీన్ద్రులు మరణించిన సందర్భముగా
బ్ర॥శ్రీ॥ జూపూడి వాసుదేవ శాస్త్రి గారు జల్లించివి

శ్రీ భాష్యఖండనఁజేయ దొడంగితి
రామ రాయ కవీంద్ర వ్రాయ వేమి?
శతవధానీ! యని! సాకూతిఁ బిల్చెదే?
శిష్య వత్సల కోప చిహ్న మేమి?
పుత్రులు లేరన్న బొత్తముల్ శిష్యుల
జూపించు నేడదిఁ జూప వేమి?
కలిత భాష్యార్క ప్రకాశ ముద్రణ పత్ర
మిదె! తప్పుఁ జూదంగ గదియ వేమి?

గురువె దైవం బటంచను కొనెడి మమ్ము
తనయుడా రాముఁడనుకొను తల్లిగారి
యాజ్ఞవల్క గురుండుగా నరయు భార్య
విడచి పోతివే! కవివర్య ! విజ్ఞధుర్య !

వైరి ముఖాబ్జముల్ వాడి పత్తలుఁ గాగ!
వాక్య చంద్రికలను బరుపు విధుండు
సప్తోత్తర చతుర్దశ దశక కృతీకృతి
చాతుర్య హృదయాబ్జ సరస సరసిఁ !
విపి ధావ ధాన ప్రవీణ శిష్య గ్రహీ
త! దిగంత కీర్తి కాంతా విభుండు!
రామానుజాచార్య! రచిత గీతా భాష్య
ఖండన తుషిత శంకర నిభుండు!

రామ రాయ్యాఖ్య కవి సార్వ భౌముఁ డకట!
బాతి కంబును విడనాడి బ్రహ్మపథము
నంది విజ్ఞాన మయమును బొందె నయ్యొ
హైందవుల దుర దృష్టమో యనఁగ నేడు!

తల్లీ ! భారతమాత! నీకడుపునన్ దారిద్ర్య విచ్ఛిత్తి గా
ముల్లోకంబుల లోన వీరుడన ఖ్యాతముల్ పట్ట రాకుండ మా
యుల్లాసంబుఁ జెలంగ బుట్టి నితడా యుర్థాయ నిర్భాగ్యుఁడై
కల్లోలం బొనరించె! లోకముల నీకాశోక మెచ్చుంగదా!

బ్ర॥శ్రీ॥ చామర్తి వేంకటపుల్లయ్య గారు

ఏ గతి సంస్కృతం బికను వృద్ధిని గాంచును కొండవీట? వే
రే గతి బీద కుఱ్ఱలకు నేర్పడు శాస్త్రము లభ్యసింపగా
సాగునె? వేఱు తావు లిటు సత్రము! పాండితి యే పురంబులో
నేగురు నొద్దఁగల్గు వచియింపుము? మా గతి యేమి కావలెన్
అభినవ శంకరుడవు రవంతయిన్ నిట బొల్లు లేదు! యా
సభ బెజవాఁడ లోన కడు శాంతియు దాంతియుఁ దోప బల్కితీ
వు! భువిని బాడబుల్ గనగ బోలదు భేదము లంచునీకు నే
మి? భయము తత్త్వ వేత్తలను మేటివి! నీ కెటు కల్గు భేదముల్.

అక్షర నీరాజనాలు :

మధురభారతి, బాలకవి సమ్రాట్ , కవికోకిల మధుర కవి
కవి రత్న బిరుదాంకితులు అవధాని
బ్ర॥శ్రీ॥ కంచర్ల పాండురంగ శర్మ సమర్పణ

**శ్రీరామా రాయ గురుమ్ భజే!**

ఋక్శా ఖాంతర మశ్వలాయన విధా గోత్రాబ్ధి సంవర్ధతే!
భారద్వాజ సగోత్ర విప్రవర భాస్వంతమ్ ప్రభా భాసితమ్!
శ్రీ లక్ష్మీ హయ గ్రీవ ధ్యాన కలితా సిద్ధాంత మేధా నిధమ్
రామా రాయ కవీంద్ర శంకర ప్రతీ! ప్రావీణ్య ! నమ్రమ్ భజే!

ఆళ్వారా హ్వయ పౌత్ర! రామ కవి! చిత్తాంతరస్థో హయ
గ్రీ వోపాస్య ప్రసాద లబ్ధ వివిధా భాష్యాంత వ్యాఖ్యా నిధీ!
మేధా పూర విశేష జ్ఞాన భవతాం! మేధ్యమ్ కరీ వర్తనమ్
మోహన్రాయ తనూభవమ్! నుత గుణమ్! మోదంకరీ! భావయే!

అన్న విద్యా దాన మవిరళ బోధైక! జ్ఞాన యజ్ఞ తృప్త సాధకుండు!
హయ వద నోపాస్య మసమాన ప్రతి! ప్రతిభా వైదుష్య ప్రేష్య భాస్కరుండు
భాష్యాంత వ్యాఖ్యాన బంధుర సింధుర! ప్రథితా పర శంకరస్వముండు
నిరత రచన విధీ నియత బ్రహ్మ విచార పండిత సత్సంగ ప్రాభవుండు
ప్రచుర బెల్లముకొండ వర్ధాశశాంక!
హనుమ మోహన రాయ దేహా త్మజుండు
ఆదిలక్ష్మీ కళత్ర ప్రియానురాగి!
రామ రాయ కవీంద్ర మార్తాండమూర్తి

తన గ్రంథచయము సుతులని,
తన శిష్యులు జ్ఞాన పుంజ తార్క్ష్యులటంచున్
అనరత బ్రహ్మవిచారా
ధన దానుని రామ రాయ తల్లజు నెంతున్!

శ్లో॥ హయాస్య మన్త్రాప్త సమస్త విద్యామ్
శతాధిక గ్రన్థ విధాన దక్షమ్
పురాత్మ విజ్ఞాన నిరస్త మోహమ్
నమామి రామాఖ్య! గురుమ్ ! సదా హమ్!

ఓం శాంతిః శాంతిస శాన్తిః

## అనుబంధములు - 1

బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారు
(రిటైర్డు జిల్లా సెంట్రల్ బ్యాంక్ మేనేజరు)
తయారొనర్చిన సాధికారికమైన వంశవృక్షము.

సనదుదారు బెల్లంకొండ చన్నప్ప -చెన్నమ్మ
భాస్కరదీక్షితులు - గుంటగార్లపాడు అగ్రహారం

పెద్దవల్లప్ప
మంగన్న నిస్సంతుతుఅయి చనిపోయినారు
రామన్న నిస్సంతుఅయి చనిపోయినారు
వల్లభరాయుడు — పాపయ్య నిస్సంతు
పట్టభిరామయ్య నిస్సంతు

పాపయ్య
శేషయ్య
వల్లభరాయుడు చనిపోయినారు

రామకృష్ణమ్మ
మోహనరాయుడు చనిపోయినాడు
భాస్కరరావు చనిపోయినాడు
వెంకట్రాయుడు
4 రామయ్య
వెంకట్రాయుడు నిస్సంతు

వెంకట్రాయుడు:
1 భాస్కరరావు
2 కృష్ణయ్య
3 రామానుజరాయుడు నిస్సంతు

కృష్ణయ్య:
సీతారామయ్య
సుబ్బమ్మ
లక్ష్మీకాంతారావు నిస్సం -

సీతారామయ్య - సుబ్బమ్మ:
రాఘవరావు - కనకమ్మ
రామదాసు - సీతాదేవి
చంద్రశేఖర్
రాజీవ్

భాస్కరరావు:
పరాంకుశ రాయుడు నిస్సంతు
వెంకయ్య
జగన్నాధరావు (దత్తు)
కనకమ్మ నిస్సంతు
పుండరీ కాక్షయ్య
వెంకాయమ్మ

రామకృష్ణారావు (దత్తు)

హనుమంతరావు - లక్ష్మీదేవి
రామారావు దత్తుపోయినాడు
పుండరీ కాక్షయ్య - అలివేలమ్మ
నరశింహమూర్తి (చనిపోయినారు)
శేఖర్ (చనిపోయినారు)

హనుమంతరావు - లక్ష్మీదేవి:
కృష్ణమూర్తి - లలితాంబ
రఘురామ్-సామ్రాజ్యం (కామాక్షి)
మాధవరావు - కనకదుర్గ

మాధవరావు - కనకదుర్గ:
మురారీహనుమంతరావు
మాధవి

రఘురామ్-సామ్రాజ్యం:
వెంకటరమణ-నళిని
చిన్మయి
వెంకటశ్రీదర్ - విమలా
రఘురామ్

కృష్ణమూర్తి - లలితాంబ:
శివసుబ్రమణ్యప్రసాద్
సాయిరామ్-శారద
చందనవల్లి
భవ్యచైతన్య



ఆళ్వారయ్య
5
మోహనరావు - హనుమాయమ్మ(భార్య)
రామారావు (రామరాయకవి) ఆదిలక్ష్మమ్మ
నారాయణరావు (దత్తు) - విజయలక్ష్మీ
ఆదిలక్ష్మీ
హనుమాంబ
మహాలక్ష్మీ
రామకోటేశ్వరరావు
సవితాలక్ష్మీ
మోహనరావు - జానకీదేవి
శ్రీనివాసరావు
యజ్ఞలక్ష్మీ
లక్ష్మీనారాయణ
ఆదినారాయణ
సాయిలక్ష్మీప్రసన్న
6
7
8
9
రామకృష్ణమ్మ
నరశింగరాయుడు
వరలక్ష్మమ్మ
రంగయ్య
గోపాలరాయుడు
వాసుదేవరావు
నిస్సంతు
నారాయణరావు
కామాక్షమ్మ
నిస్సంతు
రామచంద్రరావు (దత్తు)
కనకమ్మ
కేశవరావు(దత్తు)
వేంకటసుబ్బమ్మ
జనార్ధనరావు
వేంకటలక్ష్మమ్మ
నిస్సంతు
మల్లిఖార్జునరావు
నరసింహారావు
మహాలక్ష్మమ్మ
నరశింగరావు
భ్రమరాంబ
రామారావు (దత్తు)
భారతమ్మ
కరుణాసాగరశర్మ
ఉమాదేవి
వేంకట సుబ్రహ్మణ్యశర్మ
అరుణ
వేంకటకృష్ణరాఘవేంద్రరావు
సీతా
శ్రీలక్ష్మీ
శ్రీ విద్య
వేంకటనరశింహారావు (దత్తు)
విజయకుమారి
వేంకటలక్ష్మీనరసింహ
చక్రధర్ కుమార్
మారుతి రాధిక
వేంకటనిర్మలారాణి
భరత్‌కుమార్
సౌమ్యాణి
కృష్ణచైతన్య
వేంకటసూర్య
వేంకటజయంతు
లలిత
నరసింగరావు
పద్మప్రియ(భార్య)
విజయభారతి
వేంకట సత్య నాగ దుర్గ శివ
సాయి సాగర శర్మ
సంకలనం :
బ్రా॥శ్రీ బెల్లంకొండ వేంకటసుబ్రహ్మణ్యశర్మ
మరియు ఆయన కుమారుడు

## అనుబంధములు – 2

ఈ సమయమున ఒక మహా సన్నివేశము గుర్తుంజేసికొనుట సమంజసముగా భావించి మీముందుంచుచున్నాడను.

మా వినుకొండ స్థానిక ప్రజా నాయకుడు బ్ర॥శ్రీ॥ పులుపుల వేంకట శివయ్య గారు. వారు శుద్ధ శ్రోత్రియ వైదిక కుటుంబము నుండి వచ్చిన వారు.

శ్రీ శివయ్య గారు బెనారస్ యూనివర్సిటీలో ఎం.ఎస్.సి. చదివే రోజులు. 1934 ప్రాంతము. వారు మార్క్స్ సిద్ధాంతానికి ప్రభావితులై తన తోటి విద్యార్థులకు మార్క్సిజమ్ సిద్ధాంతలను, కేపటలిజాన్ని అందరికు అర్థమగు రీతిలో కథలు, కథలుగా జెప్పెడి వారు. ఆనాటి సిద్ధాంతబోధనకు శ్రోతలైన విద్యార్థులు చిన్న వాడైనను శ్రీ శివయ్య గారిని “తాతగారు” అని పిలచెడి వారు వారిలో శ్రీయుతులు చంద్ర రాజేశ్వరరావు పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి మున్నగు వారు ముఖ్యులు.

శ్రీ శివయ్య గారు చదువును అర్థంతరంగా ఆపికొని గుంటూరు వచ్చి పి. నరసింహారావుతో కలిసి మార్క్సిస్టు తత్త్వమును నాటి విద్యార్థులకు బోధించి ఆంధ్రదేశములో కమూనిష్టు పార్టీ స్థాపకులైన ముప్వురు నలువురలో ఒకరైరి.

శ్రీ శివయ్య గారు మాస్కోలో మరణించి నలుబదేండ్లైనను నేటికి మా సీమ ప్రజల మనస్సులలో నీరాజనములందు కుంటున్న ప్రజా నాయకుడు. శ్రీ పి.వి. శివయ్యగారిని నేను ‘మామయ్య’ అను పిలచుకొనునంతటి సన్నిహితత్వము మాకుండెడిది.

నేను 1963సం॥ నుండి వినుకొండ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో గ్రేడ్ – 2 తెలుగు పండితునిగ పని చేయుండిన రోజులు

ఒక శుభ దినమున శ్రీ పులుపుల వేంకట శివయ్యగారు ఒక పెద్దాయనను వెంట గొని పాఠశాలకు వచ్చినాడు. నేను మొదటి పిరియడ్ క్లాసులో ఉన్నాను. వారు స్టాఫ్ రూమ్‌లో కూర్చున్నారు. స్టాప్ రూమ్‌లోని

ఉపాధ్యాయులు వారెదుట కూర్చొన లేదు. అది శ్రీ శివయ్యగారి యెడల గల గౌరవము.

నేను మొదటి పిరియడ్ తదనంతరము స్టాఫ్ రూంకు వచ్చాను. శ్రీ శివయ్యగారు "శర్మా" నీతో మాట్లాడటానికి వచ్చామన్నారు. కబురు చేస్తే నేనే రాకపోయి నానా! మామయ్యా! అనగా "యిక్కడ తేల్చుకొనవలసినదే" అని వీరు బెల్లము కొండ రాఘవరావు గారు. పమిడిపాడు జమీందారులు. సంస్కృతాంధ్రాంగ్ల భాషావేత్తలు. సంగీత నిధులు ఆ కాలములో రాఘవరావు గారిల్లు శ్రీయుత కోలవెన్ను రామకోటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతం, కవి సమ్రాట్ విశ్వనాథ, కాటూరి వెంకటేశ్వరరావు, దాసు, శ్రీరామ కవి, నాయని సుబ్బారావు, దేవులపల్లి కృష్ణ శాస్త్రి మున్నగు కవితా మూర్తులతోను, కళాకారులతో కళకళలాడెడిది. వచ్చిన వారికి భోజన పానాదు లే కాక, దోసిళ్ళ కొలది వెండి రూపాయలిడి సత్కరించెడి వారు. ఆయన భార్య కనకమ్మ గారు సంస్కృత భాషలో రచనలు చేసిన విదుషీమణి.

కాలం మారినది ఓడలు బండ్లు, బండ్లు ఓడలైనవి. ఈనాడీ నెలదాతకు రోజు గడవడమే కష్టంగా ఉన్నది. మనమేదైన ఆర్థికంగా సహకరించాలి అన్నారు.

ఆ మాటలు వినిన నాకు కన్నీళ్లు పర్యంతమైనది. దిటవుగొని మా ప్రధానోపాధ్యాయులు ఆదర్శ మూర్తులు మచ్చలేని మహనీయులు బ్ర॥శ్రీ॥ జంధ్యాల కృష్ణమూర్తిగారితో చెప్పుటకు వెళ్ళినారము. ఆదర్శ గురుదేవులు శ్రీ టి.వి.యల్. నరసింహారావు గారి పిదప నాకు ఆదర్శ మూర్తిశ్రీ జంధ్యాల వారు లోగడ నరసరావుపేట టౌన్ హై స్కూలులో పని చేయుట వలన వారిని గుఱించి నెఱుగుదురు.

మేము ఆయనను దర్శించి విషయం చెప్పగనే ఆయనయు సాదర భావమున చలించిరి. వెంటనే 3,4 పిరియడ్‌లలో ఉపాధ్యాయ విద్యార్థులతో సమావేశమేర్పాటు చేసిరి.

సమావేశములో బ్ర॥శ్రీ॥ పులుపుల వేంకట శివయ్యగారు న్నూ, మా గురువులు సీనియర్ తెలుగు పండితులు బ్ర॥శ్రీ॥ కాసుల నాటి గురునాథ శర్మ

గారున్నూ, బ్ర॥శ్రీ॥ జంధ్యాల కృష్ణమూర్తి గారున్నూ, బ్ర॥శ్రీ॥ బెల్లంకొండ రాఘవరావు గారిని గురించి ప్రసంగించిరి. ప్రస్తుతము వారి స్థితి గతులను తెలిపిరి. వారికి ఆర్థిక సహాయ మందింప గోరిరి.

అది వేతనములు వచ్చు సమయము. హెడ్మాష్టరు గారు ముందునకు వచ్చి తమవంతు విరాళమును రూ. 116/-లుగా ప్రకటించిరి. అలాగే ఉపాధ్యాయులు, స్కూలు జవాను, నైటు వాచరుతో సహా వారి వారి తాహతుమేరకు ప్రకటించిరి. దానిని నాచే వివరాలు వ్రాయించిరి. చదివించిన వారిలో శ్రీ సి. హెచ్. నిత్యానందము, శ్రీ యన్. దేవేంద్రనాథ్ గారెక్కువ విరాళముల ప్రకటించిరి.

హెడ్మాష్టరు శ్రీ కృష్ణ మూర్తిగారు విద్యార్థులను మీకు తోచిన సహాయమును మీ క్లాసు టీచర్లకు యివ్వమని చెప్పిరి. ఈ రెండు దినములు తమ అతిథ్యం గై కొనమని రాఘవరావుగారిని కోరిరి.

ఆ సాయంత్రం శ్రీ శివయ్య గారును, శ్రీరాఘవరావు గారును నేను కలసి తాలూకా తహశీలు దారుగారిని కలిసితిమి. వారు పోలీసు సర్కిల్ యిన్స్పెక్టర్‌ను శిరస్తాదారును, తాలూకా రిజిస్ట్రారును ఇన్‌కంటాక్స్, సేల్స్‌టాక్స్ ఆఫీరులను పిలిపించి విషయం చెప్పిరి. వారందఱు సహాయం చేయుట కంగీకరించిరి తరువాత శ్రీ రాఘవరావు గారిని తీసికొని నేను గ్రామములోని వైశ్య ప్రముఖులను కలసితిని వారప్పటికప్పుడే తమకు తోచిన విరాళములను భారిగా నిడిరి.

మరునాడు సాయంత్రం స్కూలు మీటింగ్ హాలులో సభ ఏర్పాటు చేయబడినది. వేదికపై శ్రీ కృష్ణమూర్తిగారు అధ్యక్షులు గను, శ్రీ శివయ్య గారు శ్రీ రాఘవరావు గారు శ్రీ తాలూకా తహసీల్దార్ శర్మగారు ఆశీనులైరి.

శ్రీ పులుపుల శివయ్యగారు, శ్రీ బెల్లంకొండ రాఘవరావు గారిని గుఱించి వారి వదాన్య తను గుఱించి నేటి పరిస్థితుల గుఱించి తెలియజేసినారు. తదుపరి తెలుగుపండితులు శ్రీ కాసుల నాటి గురునాథ శర్మ గారు రాఘవరావు గారి వదాన్యతను వారికి గల సంస్కృతాంధ్రాంగ్ల భాషా లయందు గల పాండిత్యమును

, శ్రీయుతులు కోలవెన్ను రామకోటేశ్వరరావు, శ్రీ విశ్వనాథ, శ్రీ కాటూరి , శ్రీ పింగళి, శ్రీ నాయని, శ్రీ మల్లాది, శ్రీ దేవులపల్లి వారితో సత్సంగాలను వారికి జేయు సన్మానాదికములను వివరించారు. శ్రీ రాఘవరావు గారి సతీమణి శ్రీ కనకమ్మ గారికి గల సంస్కృతాంధ్ర పాండిత్యములను నుగ్గడించినారు.

తరువాత శ్రీ జంధ్యాల కృష్ణమూర్తిగారు రాఘవరావుగారు వెను జూచుకొనని దాతృత్వమును కొనియాడి అట్టి మహనీయులను గౌరవించుకొనడం. మన విధిగా బాధ్యతగా అదృష్టంగా తెలియ జేసినారు.

తదనంతరం వారి కను సన్నతో నేను మా పాఠశాల తరపున విరాళములను కవరులో పెట్టి సమర్పించినాను. తదుపరి తహసీల్దారు వారి శాఖా విరాళములను సమర్పించినారు. పోలీస్ వారు ఎక్సైజ్ డిపార్టుమెంట్ వారు మిగతా శాఖలవారు వారి వారి విరాళములు సమర్పించినారు. వినుకొండ ఆర్యవైశ్య సంఘము వారును భూరి విరాళం సమర్పించినారు. అవి అన్నియు నా చేత శ్రీ రాఘవరావు గారికి సమర్పించడం జరిగింది. అది నా అదృష్టంగా భావించినాను.

సభానంతరం శ్రీ శివయ్య గారు , శ్రీ తహసీల్దారు గారు, శ్రీ కృష్ణమూర్తి గారు, శ్రీ గురునాథ శర్మ గారు, శ్రీ సి.ఐ. గారు, నేను, రెవిన్యూ, పోలీసువారి జీబులలో బయలుదేరి రైల్వేస్టేషన్‌కు జని రైలునెక్కించి నరసరావుపేటకు పంపినాము. అదియొక మధురానుభూతి!

కాలం గడిచింది ఒక దినము నేను మా గురువు గారైన శ్రీ గురునాథ శర్మ గారు కలసి గుంటూరునకు జిల్లా పరిషత్‌కు వెళ్ళుటకు రైలులో బయలుదేరి నారము!

నరసరావుపేట స్టేషనులో బండి సుమారు అరగంట ఆగుతుంది. మేము కాఫీ త్రాగుటకు బండి దిగినారము.

అక్కడ ఎవరో పెద్దలు " శ్రీ రాఘవరావు గారి భార్య కనకమ్మగారు చనిపోయినట్లు చెప్పుకొనుట వినిన శ్రీ గురునాథ శర్మ గారు వారి దరికి చేరి

వివరములడిగి తెలిసికొనిరి. ఆయన నాతో చెప్పగ ఆ ప్రయాణమును కాన్సిల్ చేసికొని నరసరావుపేట రామిరెడ్డి పేటలో గల వారి గృహమునకు జనితిమి దారిలో మా యిరువురితరపున నేను రెండుపూల దండలు కొంటిని.

ఈలోగా ఆమె పార్థివ దేహానికి నీళ్ళుపోసి అలంకరించిరి. మేము యిరువురము ఆమెకు దండలను ధరింపజేసి, నమించితిమి, విషణ్ణ మూర్తియై కుమిలి పోతున్న శ్రీ రాఘవరావు గారికి వినమ్రముగా నమస్కరించి ఓదార్పు మాటలు పలికితిమి.

అంతలో నరసరావుపేటలోని గ్రామస్థులు వైశ్య సంఘమువారు బియ్యం పప్పు దినుసులు మున్నగునవి రిక్షాలకు వైచి పంపిరి. మార్కెట్ వారు కూరగాయలు పంపిరి. మేదరులు కావలసిన కర్ర సామ్రాగిని, కుమ్మరులు కుండలను పంపిరి. బట్టల దుకాణదారులు బట్టలు పంపిరి. మేళగాండ్లు మేళ తాళములతో జేరిరి. ఐదారుగురు వాయిద్యకారులు మంగళ వాద్యములతో జేరిరి. బ్రాహ్మణు నలుగురైదుగురు వచ్చిరి. ఐదారు రిక్షాలు తీసికొని రిక్షా కార్మికులు తమ రిక్షాలతో చేరిరి.

మేళ తాళములతోను, వేద మన్త్ర పారాయణముతోను అపర కర్మలు చేసిరి. శ్మశానమున శ్రీమతి కనకమ్మ గారి భౌతిక కాయమును చితిపై పరుండబెట్టి కుమారుండు శ్రీ రామదాసు గారు దహన మొనర్చిరి. అక్కడ చేరిన అశేష జనం కంట నీరు బెట్టిరి కొందరు తాళ జాలక బోరున ఏడ్చిరి. కొందఱు స్త్రీలు మా దొరసానమ్మ చనిపోయిందనియు, కొందఱు కూలి జనం మా తల్లి చనిపోయింది మాకు దిక్కెవ్వరని పిక్కటిల్లునట్లు భోరున యేడ్చిరి.

అక్కడకు జనాన్ని చేర్చిన రిక్షావారు డబ్బులివ్వబోగా తీసికొనక అమహా దొరసానమ్మకు సేవ జేయుటకు యీ చిన్న అవకాశం దొరికినదని వినమ్రులైరి. శ్రీ బెల్లంకొండ రాఘవరావు గారి పట్ల వినమ్రులైరి.

ప్రతి దినము రేయింబవళ్లు అన్నపూర్ణగా అన్నమిడిన తల్లి చనిపోయినదని అక్కడ అశేష జనం ఆమె మంచి తనాన్ని రావుగారి దాతృత్వమును పొగడుచుండిన వారే. నేడు వారు ఏలోకంలో నుండినను ఆ దంపతులిరువురు ధన్య జీవులు.

## అనుబంధము - 3

ఇక్కడొక విషయము చెప్ప వలసి యున్నది. బ్ర॥శ్రీ॥ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు గొప్ప పండితులు సంస్కృతాంధ్రము లందు విశేష కృషి జేసినవారు . బ్ర॥శ్రీ॥ రామా రాయ కవీంద్రుల వారికి సన్నిహితులు . శ్రీ రామారాయకవీంద్రులు మరణించి యిరువదేండ్లయినది శ్రీ శాస్త్రి గారు ఒక రాత్రి తెల్లవారు జామున కలను గనిరి. అందులో శ్రీ కవీంద్రులు స్వప్న సాక్షాత్కార మిడి తాము వ్రాసిన కొన్ని గ్రంథముల నిడి ముద్రింపవలసినదిగా కోరిరి.

బ్ర॥శ్రీ॥ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు సంస్కృతాంధ్ర సాహిత్యములందే కాక, ఆయుర్వేద వైద్యము నందును నందె వైచిన చేయి.

ఆనాడు నరసరావుపేట పట్టణమున శ్రీ తాడేపల్లి వేంకట నారాయణ గుప్త యను ధనాధి పుడైన వైశ్య శిఖామణి యుండెను.

ఆతనికి శ్రీ శాస్త్రి గారు మూడు మాసములుగా చికిత్స యొనర్చి దీర్ఘకాలవ్యాధిని నయము చేసిరి. అందులకు ప్రతిగా శ్రేష్టిగారు శ్రీ శాస్త్రి గారికి పారితోషికముగా ధనము నీ యబూనెను. అందులకు శాస్త్రిగారు సుకుమారముగా నిరాకరించి రాత్రి తాము కనిన స్వప్నమును తెలిపెను.

శ్రీ రామారాయ కవీంద్రుల అవరశంకరత్వమును అభినవ విద్యారణ్యత్వమును ప్రస్తుతించి, శ్రీ కవీంద్రులవారి గ్రంథముద్రణాభారము వహింపగోరెను. సప్తసంతానములలో ఖిలముకానిది గ్రంథరచన మనియు, గ్రంథ రచయితయు, ముద్రాపకులును శాశ్వత కీర్తిని నందుదురనియు, వారి కీర్తియెంత కాలము భూలోకమున నుండునో వారు స్వర్గారూఢులై యంత కాలమును నాకలోకమున నుందురనియు చెప్పెను. అంత శ్రేష్టి గ్రంథ ముద్రణా భారము వహించి సర్వముతానే భరించి, ముద్రణా విష్కరణాదుల నరసరావుపేటలో " నభూతో నభవిష్యతి"గా చేసిరి. ఆ విధంగా కవీంద్రులు దివ్య తేజోరూపముగా దర్శన మిచ్చిరి.

అష్ట సిద్ధుల పరిపూర్ణత్వమును దెలుపు మరియొక సన్నివేశము. శ్రీ రామా రాయ కవీంద్రులు అస్వస్థులై మంచముపై నుండి లేవ లేని స్థితి. శిష్యులు బంధువర్గము మున్నగు వారు వచ్చి చూచి పోవుచుండిరి.

ఒక శిష్యుండు వారిని దర్శింపగ వారు నిస్సహాయ స్థితిలో మంచమును కరచుకొని పరుండిరి. అప్పుడప్పుడా యనకు స్పృహ తప్పు చుండెను. తత్ శిష్యుండు ఆంగ్ల వైద్యుని నరసరావుపేటకు జని గొని వచ్చుటకు యెడ్లబండిలో పయనమయ్యెను.

ఊరు దాటి రెండు మైళ్లు జనగా బండిలో కూర్చుని యుండిన శిష్యుని ప్రక్క శ్రీ కవీంద్రులు చిరునవ్వులు చిందించుచు కూర్చుని శిష్యుని భుజమును వాత్సల్యముతో తట్టి వెను దిరుగుమని సంకేతమిడెను. శిష్యుడు గుర్వాజ్ఞాధీనుడై నిశ్చల చిత్తుడై చూచుచు ప్రణమిల్లిరి. శ్రీ రామా రాయ కవీంద్రు లంతట నదృశ్యులైరి. ఆశిష్యుడు మరలి పమిడిపాడు చేరి గురువును దర్శింప ఆయన మరణించి యుండిరి-ఆయన బోరున యేడ్చినారు. ఈ కథ మునుమాక రజక కుల శిఖామణి శ్రీకాశయ్య చెప్పిన యుదంతము.

## అనుబంధము - 4 ( స్వానుభవము)

1980వ సంవత్సర చైత్ర మాసమున నేను బి.ఏ. పరీక్ష 2వ సంవత్సరము వ్రాయుచున్నాను. నాతోబాటు వినుకొండలో స్నేహితులు నలువురు వ్రాయుచుండిరి.

ప్రతి రోజు సాయంత్రం మేము రైల్వేస్టేషనుకు వచ్చి విశ్రాంతి తీసుకొని సూర్యు దస్తమించ గనే అల్పాహారమును గైకొని యేగు చుండెడివారము.

ఆనాడు రైల్వే ప్లాట్ ఫారము చివరన గట్టుపై ఒక ముదుసలి గూర్చుండి తదేకముగా, గ్రంథపఠనము చేయుచుండెను. నేనసలే పుస్తకముల పురుగును. నేనాతని సమీపించి బాబూ! ఏ పుస్తకమంటిని అంత వృద్ధుండు తలయెత్తి చూచి హర్షనైషధ మనినాడు. నేనాశ్చర్యమందితిని. వృద్ధుడు, అంగవస్త్రము వంటిన గట్టి. చేతుల 'కోరా' ము తక బన్నీను ధరించి యుండెను.

నేనప్పటికి పండితుండనని కించిత్ గర్వము చూపుచు " మీదేయూరు? మీరేమి చదివితిరి? మీ గురువెవ్వరు? ఇత్యాది ప్రశ్నలు వైచితిని" అంత నాతడు తాను చదువుచుండిన గ్రంథము భాగమును వేప యీనతో మడచి నావైపు ఆదరంతో జూచుచు "తన పేరు కాశయ్య అనియు, మునుమాక గ్రామ నివాసిననియు, చాకలికులస్థుండననియు, చివరిదశలో ఒక నెల రోజులు శ్రీ బెల్లంకొండ రామా రాయ జగద్గురు శిష్యత్వము చేసితిననియు, నా పాప ఫలముగా నా చదువు పూర్తి కాకుండగనే నా గురువు నా దేవుడు మరణించె" ననియు కంటతడి పెట్టుకొనుచు సంస్కృతముననుడివెను నేనును చకితుండనైతిని.

శ్రీ రామారాయ కవీంద్రుల గ్రంథములు నేడు దొరుకునా! యని యడుగ " బ్ర॥శ్రీ॥ కవితా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రియను పండితుడు వ్యయ ప్రయాసల కోర్చి అచ్చువైచెను. చెల్లినవి చెల్లగా కొన్నియుండిన యుండవచ్చును. శ్రీ శాస్త్రి గారు మరణించి బహుకాలమైనది. నేడాయన భార్యయున్నది విచారింతమనియు, తాను ఆదివారము నాకై వచ్చెదని మాటయిచ్చినాడు.

ఆదివారం ఉదయం 8 గంటలకు బండి కడకు పోగా ఆయన చనుదెంచెను. ఇరువురము రామిరెడ్డిపేట లోని శాస్త్రి గారింటికి పోయితిమి.

ఆమె యేదో పని చేయుచున్నది శ్రీ కాశయ్య గారే ముందుగా యింటి ప్రాంగణము లోనికి జనగా, నే నాయన ననుసరించితిని "అమ్మా! యీయన పొందు రంగ శర్మయని వినుకొండ హైస్కూలులో పండితునిగా పనిచేయుచున్నాడు. "శ్రీరామా రాయ కవీంద్రుల గ్రంథములు కావలయు ననగా మీకడకు కొని వచ్చితిని. తమ దగ్గరుండినవా! అని వినమ్రుడై యడుగ అమె నిర్లక్ష్యముగా క్రుద్ధయై" ఏమి రామారావు గ్రంథాలో పాడో యిల్లు గుల్ల చేసినాడు పాపిష్టి వాడు ( భర్త శాస్త్రిగారిని) పోయిన వాడు పోక యీ దరిద్రాన్ని మా కంటగట్టాడు. అవిగో ఆ రెండు అటకలపైనున్నవి. తొంబది రూపాయలిచ్చి గొని పొందు మా దరిద్రము పోతుంది" అనినది.

నేను నిర్విణ్ణుడైనాను. శ్రీ కాశయ్య కండ్లొండు రెండు కన్నీటి బిందువులు రాల్చినవి. ఆయనపై తుండుతో తుడిచికొని నన్ను జూడ నేను " అమ్మా! నేటికి సరిగా అయిదవనాడు వచ్చి మీ చెప్పిన ధనమునిచ్చి తీసికొని పోతాను ఎవ్వరికి త్వరపడి యివ్వకండి. ఇదిగో పదిరూపాయలు అడ్వాన్సుగా ఉంచండి" అనగా ఆమె ఆ ముదరష్టపు కాగితా లెవరికి కావాలి. అడ్వాన్సు అక్కర్లేదు పోయి రమ్మన్నది.

శ్రీ కాశయ్య గారు నొచ్చుకుంటూ ఆయన ఎంతటి పండితుండో. ద్వితీయంగా యీమెను చేసికొనినాడు. ఈ పాల ఘాటు దానికి సంస్కృతాంధ్ర భాషా సంస్కృతులేమి తెలుసు. ఆయన పాలిటీమె యొక జ్యేష్ఠ. నిరంతరము ధనమునకై రాచి ఱంపాన పెట్టెడిది. ఆయన కీమె నుండి సుఖము లేదు శుద్ధాత్రము లేదు అని నాడు.

అయిదవ నాడు వేమిరువురుము శ్రీశాస్త్రి గారింటికి జని పుస్తకములివ్వమని కోర, ఆమె నిర్లక్ష్యంగా మొన్నెవ్వడో చిత్తుకాగితముల వాడు వస్తే యేబది రూపాయలకు వాడికి పారవైచి చేతులు దులుపుకున్నాను. ఆ ముదనష్టపు కాగితాలు పోయిన తరువాత హాయిగా వున్నాను అన్నది.

ఆమె చేసిన పనికి దుఃఖించాలనో కోపపడవలయునో తెలియక చకితుడనైన నన్నుగని శ్రీ కాశయ్య " మనమా గ్రంథములు లభించే అదృష్టమునకు నోచుకొన లేదు పద" అని అనునయింప తలపంచికొని మరలిపోయితిమి.

అనుబంధం -5

# మధురానుభూతులు

వెయ్యి మంది భక్తులలో ముక్తికోసం ప్రయత్నించే వారు ఏ ఒక్కరో ఉంటారని ద్వాపర యుగంలో శ్రీ కృష్ణభగవానుడు చెప్పాడు. అటువంటప్పుడు ఈ కలియుగంలో స్వార్థం లేకుండా ఆత్మ జ్ఞానం కల్గిన మహాత్ములు ఎంతో అరుదు అట్టివారైన శ్రీ బెల్లంకొండ రామా రాయ కవీంద్రుల గురించి, వారి భార్య శ్రీమతి ఆది లక్ష్మమ్మ గారి (మాతాత, అవ్వ) గురించి బొత్తిగా రచనా సామర్థ్యం లేని నేను ఏమి వ్రాసినను అది అతి స్వల్పమే. తాత గారు అపర ఆదిశంకరులనుటకు ఈ క్రింది సంఘటనలే నిదర్శనము. అవ్వగారి వలన నేను పంచుకున్న అనుభూతులు విన్నవి యిందు వివరిస్తున్నాను.

తాత గారు బ్రాహ్మీముహూర్తమందులేచి ఊరివెలుపల వున్న శేషబావిలో స్నానాధికములు ముగించి చింత తోపులలో ఒక చింత చెట్టుక్రింది కొంత సేపు ధ్యానం చేసుకొనేవారట. అప్పుడు వారు అద్భుతమైన దివ్యతేజస్సుతో వెలిగి పోతుండేవారట. వారిని చూచిన రైతులు దగ్గరకు వెళ్ళేవారు కారట. ఏ శబ్దము చేసినా వారి ధ్యానమునకు భంగం కల్గునని, దూరముగా వెళ్ళివారి వ్యవసాయ భూములలో పనులందునిమగ్నులయ్యేవారట. తాతగారి మండువా పెంకుటింటికి వెనుక ప్రక్కన ఒక పూరి ఇల్లు ఉండేదట. వారు ఎక్కువ సమయం అక్కడే గడిపేవారట, తాతగారు హయగ్రీవ ఉపాసన, గాయత్రీ ధ్యానం, రచనా వ్యాసాంగం మొదలైన వన్నీ అక్కడే నిర్వర్తించేవారట. అప్పుడు ఆయన శిరస్సు చుట్టూ తేజోవంతమైన కాంతులు వెదజల్లేవని అదిచూసి అవ్వ(కవీంద్రుల భార్య ఆదిలక్ష్మమ్మ) గారు నిశ్చేష్టులయ్యేవారట. వీరు కూర్చున్న గృహము చుట్టూ పైభాగమందు వ్రేలాడు గడ్డి తూడులు పాములు వ్రేలాడుచున్నట్లు కన్పించేవని, రాత్రిపూట పొలం కాపలాలకు వెళ్ళు రైతులు చూచి భయకంపితులయ్యేవారట. ప్రతిరోజు ఒక శ్వేతాశ్వము ఇంటి చుట్టూ రాత్రి వేళ తిరుగుచున్నట్లు కన్పించేదని చెప్పుకొనేవారు. తాతగారు చక్రాంకితములు తిరస్కరించిననూ శిష్యులు ఏవర్ణము వారైనను భేద భావమ్ము చూపక సంపూర్ణముగా అనుగ్రహించారనుటకు ఈ క్రింది సంఘటన నిదర్శనము.

మునుమాకలోని రజకుడైన కాశయ్యను శిష్యునిగా అనుగ్రహించుట. తాతగారి చివరి దశలో వారి శిష్యులొకరు నరసరావుపేటకు వెళ్ళి వైద్యుని తీసుకు రాదలచి ఎడ్ల బండిలో వెళుతుంటే అతని ప్రక్కన కూర్చొని చిరునవ్వుతో అతని భుజముపై చేయి వేశారట. ఆ సమయంలో లేవలేని స్థితిలో ఇంట్లో వున్న తాతగారు తన శిష్యునకు ఆ విధముగా కన్పించుట అత్యద్భుతం. ఈ విషయములు అవ్వగారు మా బాల్యంలో మాకు కథలుగా చెప్పేవారు. నా బాల్యం వారి వద్ద గడిచింది. ఆమె సంగీత ప్రావీణ్యము కలవారు. భగవద్భక్తితో వుండేవారు. ఒకసారి అవ్వగారు కాశీయాత్ర వెళ్ళదలచి వారి పుట్టినిల్లైన నెల్లూరునకు వెళ్ళగా, వారి వదిన గారు మీరు ధనవంతులు ఎప్పుడైనా వెళ్ళ గలరు. నా పరిస్థితి అలాకాదు. మీరు సహాయం చేస్తే యీ సారి నేను వెళ్ళి వస్తానంటే, ఆమెను కాశీకి పంపి అవ్వ గారి ఇంటికి తిరిగివచ్చేశారు. మరియొక సారి మా ఇంట్లో అవ్వ మా కుటుంబ సభ్యులతో మాట్లాడుచుండగా, ఎవరో ఒక పిల్లవాడు వచ్చి మీ జీతగాడు ఇంట్లో ఇత్తడి గుండిగ తీసుకు వెళుతున్నాడని చెపితే, పగలే తీసుకువెళ్తున్నాడంటే వాడికి ఎంత అవసరమొచ్చిందో పాపం అన్నారే కాని పిలిచి కేక వేయలేదు. ఆమె కలత చెందనూ లేదు. ఒకరికి ఇచ్చుటలో ఆ దంపతులకున్న తృప్తి అమోఘము. తాతగారు జీవించిన రోజులలో దోసిలితో వెండి రూపాయి నాణెములు దానము, ధర్మము చేసేవారట. శ్రీ రామకృష్ణ పరమ హంస, శారదాదేవి వలె నీ తాతగారు రచనా వ్యాసాంగం, అవ్వగారు ధాన, ధర్మాలు, భక్తి భావనలతో పవిత్ర భావమే కనపడుతుంది. ఈ గ్రంథం వెలుగులోకి తెస్తున్న శ్రీ కంచర్ల పాండు రంగ శర్మగారికి, ఇందుకు సహాయ సహకారములందించిన మహానుభావులందరికి ... కృతజ్ఞతలతో నా హృదపూర్వక నమస్కారములు.

– పేర్నమిట్ట పద్మావతి దేవి

(శ్రీ బెల్లకొండ రామా రాయ కవీంద్రుల మనుమరాలు)

నెల్లూరు.

# శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రుల ట్రస్ట్

ఇంటి నెం. 12-8-5/5, ప్రకాష్ నగర్, నరసరావుపేట. రి.నెం. 112/బి3-4/09



గౌరవాధ్యక్షులు :
బ్ర॥ శ్రీ ఆచార్య బెల్లంకొండ శ్రీనివాస బాలసాయి యోగి



అధ్యక్షులు :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ వేంకట సుబ్రహ్మణ్యశర్మ



ఉపాధ్యక్షులు :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ రామలింగేశ్వరరావు



ప్రధాన కార్యదర్శి :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ నరసింహారావు



సహాయ కార్యదర్శి :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ మోహనరావు



కోశాధికారి :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ వేంకట లక్ష్మీనరసింహ మల్లికార్జున కుమార్



కార్యనిర్వాహక సభ్యులు :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ వేంకట కృష్ణ రాఘవేంద్రరావు



కార్యనిర్వాహక సభ్యులు :
బ్ర॥ శ్రీ బెల్లంకొండ సాయిరామ్

# కవి పరిచయం

| | | |
|---|---|---|
| పేరు | : | కంచర్ల పాండు రంగ శర్మ |
| తల్లిదండ్రులు | : | పరమ పూజ్యులు నాగరత్న మాంబా, సూర్య నారాయణ రావు దంపతులు (రామకోటిలేఖరి, మహాకవి.) |
| జన్మస్థలం | : | వితంరాజుపల్లి, వినుకొండ (తాలూకా) గుంటూరు జిల్లా. |
| సతీమణి | : | చి॥ల॥సౌ॥ సత్యవతీ దేవి |
| సంతానం | : | రామ జ్యోతి(రామసుబ్బమ్మ), రఘురామశర్మ, విజయ భారతి, యశోధరా దేవి. |
| గురువులు | : | (ఎ). సాహిత్యం - మాన్యమూర్తులు శ్రీ కంచర్ల సూర్యనారాయణరావు, శ్రీ కొప్పరపు బుచ్చి రామకవి (అవధానం) నవయుగ కవిచక్రవర్తి శ్రీ గుఱ్ఱం జాషువా, కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ<br>(బి). చిత్రలేఖనం- మాన్య మూర్తులు శ్రీ సోముల మాలవ్యా. శ్రీ పోట్లూరి హనుమంతరావు (చిత్రలేఖనం, ఫోటోగ్రఫీ) |
| విద్య | : | ఎ) ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి ఆచార్య పట్టములు<br>బి) మద్రాసు వారి చిత్రలేఖనమందు డిప్లమో |
| వృత్తి | : | తెలుగు పండిట్, బి.ఎడ్., ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయుడు |
| బిరుదములు | : | 1) కవికోకిల (జాషువా ఆధ్వర్యం), 2) కవిరత్న (శ్రీ ధర్మాల సుబ్బారాయ శాస్త్రి), 3) మధుర భారతి, (మధ్వశ్రీకాశి కృష్ణాచార్యులు), 4) మధుర కవి (కవి సమ్రాట్ బ్ర.శ్రీ. విశ్వనాథ సత్యనారాయణ), 5) బాల కవిసమ్రాట్ (బ్ర.శ్రీ. వేదాంతకవి) 6)సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టువారిచే 2010 సంవత్సరమునకు ప్రతిభాపురస్కార ప్రధానము. |
| సన్మానములు | : | గజారోహణ, పగటిదివిటీ పల్లకి ఊరేగింపు, కనకాభిషేకాది సహస్రాధిక సన్మానములు. |
| మాన్యతలు | : | 1) పీఠాచార్యులు శ్రీ రామదాసు విద్వత్ కళాపీఠము - నేలకొండపల్లి |

| | | |
|---|---|---|
| ప్రస్తుత స్థితి | : | ఆధ్యాత్మిక గురుస్థానం. 2) రామదాసు ప్రాజెక్టు సలహా సంఘ సభ్యులు - ఖమ్మం. |
| రచనలు | : | **పద్యకృతులు**- రసానందం (ఖండకావ్యాలు 1,2,3,4,5 భాగములు), కవిబ్రహ్మ (ప్రబంధము), శ్రీపాండురంగ రామాయణము. దయామయి, మధువహనము, ఉపాయనము. **గద్య కృతులు**- గండపెండేరము, లవంగి, మహాకవి కాళిదాసు, భక్తరామదాసు, మహాపురుషులు (రామకృష్ణ వివేకానందులు), మహాభక్తులు (గోపరాజు, పోతరాజు, త్యాగరాజు) రెక్సోనా (పురోత్తముడు), కుండిన, అష్టదిగ్గజ కవులు. |
| శతకములు | : | జానకీ పతీ శతకము, విశ్వేశ్వర శతకము, శ్రీ పృథులగిరి లక్ష్మీ నరసింహ శతకము. |
| విమర్శలు, పరిశోధనలు | : | ఆంధ్రపంచకావ్యాలు, భాగవతం-(పరిశీలన) నన్నయ్య భట్టు, పుట్టుపూర్వోత్తరాలు. ఉమర్‌ఖయ్యామ్ తత్త్వగాంధర్వము |
| చరిత్రలు జీవితచరిత్రలు | : | వినుకొండ సీమ, విశ్వనరుడు (మహాకవి గుఱ్ఱం జాషువా జీవితము- కవితా ప్రస్థానం) గరికపాటి రాజారావు, పోతన్న- శ్రీనాథులు, మరియొక వాల్మీకి విశ్వనాథ, ఆనాటి కులపతులే.,కుర్తానం ఒధాసి జగద్గురు నేటి సిద్ధేశ్వరానంద భారతీ స్వామి, అపరశంకరులు అభినవ విద్యారణ్య బ్ర॥శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రులు, బ్ర॥శ్రీ మహాయోగి తుంగదుర్తి బుచ్చయ్య అవధూతేంద్రులు, అభినవవాగను శాసనుడు అహోబిల పండితులు మున్నగునవి. |
| కథలు | : | కథాశతి(నూరు కథలు) మాకథ (ఆత్మకథ) |
| నాటకములు | : | బడిపంతులు, గండపెండేరము, ఉమర్ ఖయ్యామ్, రామదాసు, రాధామాధవమ్(జయదేవ- పద్మావతీ చరణచారణ చక్రవర్తి). |

నాటికలు : చాణక్యశపథము, శ్రీనాథ, విశ్వనరుడు
సంస్కృతకృతులు: శ్రీరామలిఙ్గేశ్వర సుప్రభాతమ్, శ్రీ చంద్రమౌళీశ్వర సుప్రభాతమ్, శ్రీ గుంటి ఆంజనేయస్వామి సుప్రభాతమ్, అంబాశతి, శివాక్షరి మున్నగునవి.
అనువాదాలు : ఎ) సంస్కృతం నుండి - శ్రీపాండురంగ రామాయణము (పద్యకావ్యము) పంచబాణవిలాసము, మేఘసందేశము, శివానందలహరి,
బి) అన్య భాషా (ఆంగ్లంనుండి) ఉమర్ ఖయ్యామ్‌రు బాయత్‌లు , గీతాంజలి, పోస్టాఫీసు.
బాధాకరము : రెండు వందల కృతులు వర్షములో తడిచి నిరుపయోగమగుట.
చిత్రలేఖనములు: <u>(1). సీటి చిత్రాలు -</u> రవీంద్రనాథ్ ఠాకూర్, భక్త మీరా, వేమన్న, పోతన్న, భగవాన్ బుద్ధ, ప్రకృతిలో పరమాత్మ, ఋషి సార్వభౌముడు, జటాయువు.
<u>(2). తైలవర్ణచిత్రాలు -</u> రామదాసు, తుంగదుర్తి బుచ్చయ్య అవధూతేంద్రులు, గొలగమూడి వెంకయ్య స్వామి, విశ్వయోగి విశ్వంజీ, మేదర, రైతు, చెంచు మున్నగునవి.
<u>(3). రేఖా చిత్రాలు -</u> వివిధ న్యాట భంగిమలు, **ఫ్రీహేండ్ ఔట్‌లైన్**, బాపూజీ, నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రామకృష్ణ పరమహంస, మాస్టర్ సి.వి.వి. రమణ మహర్షి లైను చిత్రాలు, డిజైన్సు వందకుపైగా
ఆవేదనము : భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు ఆచారవ్యవహారాలు , సంగీత సాహిత్యాలు, నాట్యాలు కనుమరుగవటం.
ఆశయము : విదేశీయ సంస్కృతిలో మంచిది గ్రహించి; భారతీయ సంస్కృతీ, సాంప్రదాయాలను పరిరక్షించాలి. ప్రపంచ భాషలకు మూలమైన సంస్కృతభాషాధ్యయనము విద్యార్థులచే చేయించాలి.
సూక్తి : విదేశీయ మంతయు మంచిది కాదు, భారత భారతీ సంస్కృతి యంతయు చెడుది గాదు. సత్యం ధర్మం ప్రేమ, అహింస, పరోపకారం పాటించాలి.

